గోపాల్ మహోపాధ్యాయ, లాల్

# ఆరోగ్య శత్రువులు

బెంగుళూరు, 1922

Record no. 540

Gōpāl Mahāpādhyāya, Lāl

Ārōgya śatruvulu

Beṅguḷūru, 1922

Record no. 540

# Bibliographic Record Target

గోపాల్ మహాపాధ్యాయ, లాల్.

ఆరోగ్య శత్రువులు : Enemies of health / గ్రంథకర్త లాల్ గోపాల్ మహాపాధ్యాయ.- బెంగుళూరు : సెవెంత్ డే ఆడ్వెటిస్టు పబ్లిషింగ్ హౌస్, 1922.

2, 83 p. :ill., ports. ;21 cm.

Record no. 540

Gōpāl Mahāpādhyāya, Lāl.

Ārōgya śatruvulu : Enemies of health / granthakarta Lāl Gōpāl Mahāpādhyāya.- Beṅguḷūru : Sevent Ḍē Āḍveṭisṭu pabliṣiṅg Haus, 1922.

2, 83 p. :ill., ports. ;21 cm.

Record no. 540




మరణపు ద్వారములు సారాయము త్రాగువారి సమూహములతో నింపబడియుండును.



బహు త్వరితముగా వృద్ధిజెంది, యనేకవేల స్వదేశస్థులకుటుంబములకు చెప్పనలవిగాని నష్టమునుకలిగించెను. బుద్ధిమాంద్యతయున్ను, దుర్బలత్వమున్ను సారాయిద్రవ్యముల వ్యాపారమును వెంటనంటియుండును. ఇట్టిది సీమసారాయిలను త్రాగు ధనవంతులయందు మాత్రమే యుండునని గాదు; ఇది బీదవారియందున్ను గొప్ప నాశనకరమైనదిగాను, నీతిని జెరచునొక దురలవాటుగా మెల్ల మెల్లగా వృద్ధియగుచున్నది. మహా హానికరములగు దేశీయసారాయములు చవుకయగుటచే బీదలకును, నిఱుపేదలకును అందుబాటులోనుంటున్నవి. ఈ పిశాచముయొక్క వినాశకరమైన చెడ్డపనులు దేశక్షేమమును గోరు ఏభారతీయుడైనను సహించగలడా? ఈ పిశాచమును దేశమునుంచి పారద్రోలుట ప్రతిభారతీయునకును విధిగాదా?

ఈ యధ్యాయమందలి కొన్ని విషయములును, రుజువులును, అట్టి అభ్యాసమునుండి దూరముగానుండుడని చదువరులను ప్రోత్సాహపర్చుటయేగాక, అట్టివారనేకులు వివేకముకలిగిన స్వదేశాభిమానులై బర్మా, సింహళ, హిందూదేశములందున్న యీవ్యాపారమునంతమునొందింప సమకట్టవలయునని కూడా చెప్పుచున్నవి.

పశ్చిమదేశములలో సారాయి వ్యాపారమెక్కువగానుండుటయేవానికి చాలబాధకరముగానుంటున్నది. అందుచే నాత్రుతగల కొందరు పురుషులును, స్త్రీలును గలసి సారాయి త్రాగుడు మాన్పుటయే మవిధియని యెంచి అదినిర్మూలమగు వరకెట్టికష్టములనైన బడుటకు నిశ్చయించుకొని అవి దేశమున అమ్మబడకుండునంత వరకు నిద్రింపజాలమనిరి. అందుచే ముప్పది యాఱు లక్షల చదురపుమైళ్ల వైశాల్యమున్ను, నూరుకోట్ల జనులునుగల యునైటెడ్ స్టేట్స్ అను అమెరికాయందలి నొకదేశపు హద్దులలోపల నెచ్చటను మధుసారమమ్మబడ కూడదని యాదేశాధికారు లాజ్ఞలిచ్చిరి. నాగరికములైన కొన్నియితర దేశములు మధుసారపు వ్యాపారమే మాన్పివేసిరి. మరికొందఱు లోకాభిమానులు మధుసారపువ్యాపారమును బొత్తిగా మాన్పివేయవలయునని గొప్పప్రయత్నములు చేయుచున్నారు. మన

మును యిట్టి పిశాచమును మనయిండ్లనుండియేగాక మనమతిప్రేమగా జూచు నీ హిందూదేశమునుండియు తొలగింప నిశ్చయించుకొనునట్లు ప్రతివారి హృదయమును పురికొల్పునుద్దేశ్యముతో నీక్రింది విషయము లుదహరింప బడినవి. ఇదివరకు ఇంగ్లాండులో ప్రధానమంత్రిగానుండిన విలియమ్. ఎవార్ట్. గ్లాడ్‌స్టన్ అనువారు, 1880 సంవత్సరమందు జరిగిన ప్రజల సభయందు "యుద్ధము, అంటురోగములు, కరువు, అను యీమూడింటికంటె త్రాగుడు ప్రజలకెక్కువవిపత్తు కలుగ జేసెన" ని చెప్పిరి.

## మితానుభవమననేమి.

" మితమను మాటకు సమాన్యముగా ఎక్కువగా కుండ అని యర్థము. అట్టి యర్థముతో త్రాగుడుకొంచెముండ వచ్చునని యనుకొనినయెడల, మొదటకొద్దిలో యారంభించ బడిన యీయలవాటు తుదకమితమై మోసము జేయును. కాబట్టి మితానుభవమనగా త్రాగుడు బొత్తిగా లేకుండుటయని చెప్పుటవసరమై యుంటున్నది" ని సర్. బాలచంద్రక్రిష్ణ. కె. టి. ఎల్. ఎం. యనువారు ఆన 1905 సంవత్సరమందు హిందూదేశమంతటి కొరకై కాశీలో జరిగిన మితానుభవ సమావేశములో జెప్పిరి.



త్రాగుబోతు తనస్వంతప్రాణమును గూర్చియైనను జాగ్రత్తపడడు.

# మధుసారమన నేమి.

మధుసారము తన్ననుగూర్చి మనకీక్రిందివిధముగా జెప్పుచున్నది :-

“ నేను నిప్పునైయున్నాను. కాల్చగలను, మాడ్చగలను. క్షీణింపచేయుటయేగాని యెన్నడైనను వృద్ధిబొందింపను. నేనే రోగమునైయున్నాను. నావలనవచ్చు జ్వరమతివేడిగానుండును. నేనే కాష్ఠమునైయున్నాను. నేను రాజవస్త్రములను, గురువుల నిలువుటంగీలను, రాణులపట్టువస్త్రములను ఎన్నడైనను తృప్తిలేనట్టి నాకడుపున బెట్టుకొందును. నావలనగలుగు మత్తు ప్రకాశమానమై కొద్ది కొద్దిగాతగ్గుచు, తుదకేమియు లేకుండా పోయి కొంచెము నెమ్మదిగలుగ జేయును. పిమ్మటనాలో పుట్టుమంటలు మెల్ల మెల్లగా హెచ్చిచుట్టునున్నదానిని నాశనము జేయుచు తుదకేమియు మిగులకుండు వఱకు కాల్చివేయుచుందును. నేను మంటలతో నిండిన సరస్సునైయున్నాను. నాహద్దులలోనడచు యేనాలుకయు తనదాహమును తీర్చుకొనలేదు. నన్నునీరు ఎంతమాత్రమును ఆర్పలేదు.

క్లింటన్ బాంక్రాప్ట్.

---

# మధుసారము మెదడునందు చేయుపని.

“ మెదడునందలి ముఖ్యావయవములు ఈక్రింది విధముగా వృద్ధి పొందును :—గుండెముఖ్యభాగములు, ఊపిరితిత్తి ముఖ్యభాగములు, కండరముల ముఖ్యభాగములు, జ్ఞానముఖ్యభాగములు, ఇంద్రియ నిగ్రహముఖ్యభాగములు.

మధుసారము ఈ పైముఖ్యభాగముల నంటుకొని అవిచేయుపనికి వ్యతిరేకమైన పనిచేయుచు మనుష్యుడు తన్నుతాను స్వాధీన పరచుకొనుశక్తితగ్గించును. ఇట్లు ప్రాణమునందలి మిగుల విలువగల భాగములేముందుగా మధుసారముయొక్క నాశనపు పనిని రుచిచూచునవి. దేహమునకెంత కష్టము కలిగినదో కనుగొనవలెనన ఎంతసారాయముత్రాగితిమో కనుగొనిన చాలును. ఇదిజ్ఞానమునకు స్థానమైన



ముఖ్యావయవములను చెరుపుటచేత వాని యింద్రియములు సరిగా పనిచేయలేవు. అందుచేత కాలముయొక్కయు, స్థలముయొక్కయు, ఇతరుల యొక్కయు జ్ఞానము స్పష్టముగానుండదు. ఇవన్నియు వానిమనస్సులో అల్లకల్లోలముగా నుండును. రైలుమార్గ అధికారులును ఇతర అధికారులును వారిపనివారు బొత్తుగా త్రాగకుండునటుల ప్రోత్సాహపరచుచున్నారు. పైనరములలోని మూడవ సముదాయమును దుర్బలము చేయుటచేత కండరముల కదలిక నిశ్చలమైనదిగా నుండదు. మనుష్యులు ఇట్టి మత్తుతోనుండి వీధులలో తిరుగులాడునప్పుడును మరలలో పనిచేయునప్పుడును అపాయములు సంభవించును. చివరగా గుండె, ఊపిరితిత్తులను నడుపుమూలాధారములను కదలించును. ఇట్టి అమిత ఉపయోగమునకు మరణమేతగిన ఫలమైయుండుననుటకు సందియము లేదు.

ఇతరావయవములన్నటికంటె మెదడునందు మద్యము చేయుపని ఎక్కువనాశనకరమై యున్నది. మద్యసారమునకు దాసుడగు నొక దురదృష్టవంతుడు తాను రానురాను ఆడుమాటలకును చేయుపనులకునుజవాబుదారియైయుండకపోవుటచే ఇతరులచే వాడుపిచ్చివాడుగా నెంచబడును గనుక తన్ను తానుగాని యితరులనుగాని హానిపరచకుండ అతడు కాపాడ బడవలెను.

# మద్యసారము రక్తపారుదలయందు చేయుపని.

రక్తమందలి జీవకణములు ప్రాణవాయువును సన్నని యల్లిక నరములకు కొనిపోవును. ఎక్కువమంచి యారోగ్యము ఎఱ్ఱజీవకణములను వానిసంచారమును బట్టియే యుండును. మద్యము యెఱ్ఱజీవకణముల బలము తగ్గించుటచే వానిసంచలనము మందగించును. నగర రక్షకునివలె పనిచేయు తెల్లజీవకణములు దేహమందంకురించునట్టిగాని, లేక వెలుపలినుండి చొరబడునట్టిగాని రోగాంకురములను నిర్మూలముచేయును. అయితే మద్యసారము రోగాంకురములను జంపు తెల్లకణములు, రోగాంకురములను సమీపింపనశక్తులగా చేయుటచే,

రోగాంకురములు నిరాటంకముగా రక్తమందు ప్రవేశించి దేహమంతయువ్యాపించి, బలహీనములగు అవయవములను లోపరచుకొనును.

అంకురముల సిద్ధాంతమందు నిపుణుడగు ప్రొఫెస్సర్ మెచ్నికాఫ్ యనునాయన మధుసారము . దేహమందలి నరములకు, యితర ముఖ్యావయవములకు అనారోగ్యమగుటయేగాక అంటురోగములను దెచ్చు అంకురముల నెదిరించి దేహసంరక్షణ జేయు తెల్లజీవకణములకు మిగుల హాని కల్గించునని చెప్పెను.

## నరములు—మధుసారమును.

మెదడు, వెన్నుపూస, నరములబోలు, నారనరములు యివన్నియు నరములలోని భాగములే. సారాయము వలన నరములు రేపబడి కోపగుణమును గలుగజేయును. ఇట్లు అదికోపమైనను లేదా మత్తైనను కల్గించునదైయున్నది. ఇదితగ్గుటతోడనే దేహమునకు బలహీనమున్ను, మనస్సునకు విచారమున్ను కల్గును. మధుసారము కొంచెముమత్తు కల్గించుటయేగాక బొత్తుగా స్మృతితప్పజేసి పక్షవాతము, నరములలో తిమ్మిర్లుకూడా కొంతవరకు కల్గించును.



బుద్ధిహీనుడును, అతడు సారాయి త్రాగు పాత్రయును.

## మధుసారము వంశపరంపరగా జేయుపని.

వంశ పారంపర్యమనగా తలిదండ్రులకుండు కొన్నిగుణములు పిల్లలు కల్గియుండుట. గర్భధారణకాలమందుతలిదండ్రుల దేహస్థితి, బుద్ధికుశలత యెట్టిస్థితియందుండునో పుట్టబోవుబిడ్డలలోకూడా నట్లేయుండును. ఇట్టిసిద్ధాంతమును బట్టి స్త్రీపురుషులు తమకెట్టిబిడ్డలుకల్గుదురో నిశ్చయించుకొనవచ్చును.





పడుచువారు త్రాగుడువల్ల సంతోషమే కోరుదురుగాని హానినిగూర్చి విచారింపరు.

"మత్తుపదార్థముల నుపయోగించు తలిదండ్రులకు కలుగు పిల్లలు బలహీనులును, వివేకశూన్యులును, కించిదాయుస్సును గలిగి, సహజముగా దుష్ప్రవర్తన గలిగినవారైయుందురనుటకనేక దృష్టాంతములు గలవు". అని కేంబ్రిడ్జి రోగనిదాన కళాశాల శాస్త్రజ్ఞుడగు జి. సిమ్స్ వుడ్-హెడ్. ఎం. ఎ., ఎం. డి. గారు చెప్పిరి.



డు బాగుగా త్రాగి నశించిపోవుటయందు పిశాచి బహుసంతోషించును.



వెఱ్ఱితనము, కాకి సోమాలయను నొక విధమగు మూర్ఛరోగమును మధుసారమెక్కువగా నుపయోగించువారి బిడ్డలకుందు రోగములే. త్రాగుబోతుల బిడ్డలు సాధారణముగా పసితనమందే మరణించెదరు.

## మధుసారము—రోగములు.

ఏబదిసంవత్సరముల క్రిందట మధుసారము బలమును, రోగములను శాంతిపరచు నొక యౌషధమని వైద్యులు నమ్మియుండిరిగాని యిటీవల రోగమును ప్రబలజేయు అంకురములను నిర్మూలము చేయుటకుగాని, వానిశక్తి నాపుటకుగాని మధుసారమెంతమాత్రముపయోగింపరాదనియు, దానినుపయోగించు వైద్యశాలలలోకంటె ఉపయోగింపని వైద్యశాలలలో మరణములు బహుకొద్దియనియు సరిపోల్చి కనుగొనిరి.

బుద్ధిమంతులగు కొందరు, ఆరోగ్యము చెఱిపి, బలమును తగ్గించు నొక వస్తువు దేహమునకు బలము కలుగ జేయుననిగాని, బలముగల దేహులకెక్కువ బలము నిచ్చుననిగాని నమ్మజాలకుండిరి.

మధుసారము, రోగముల నెదిరించుశక్తిని మన దేహమునుండి తగ్గించుటయేగాక రోగము వచ్చిన తరువాత దానిని సులభముగా తగ్గించుకొను శక్తిని గూడ బలహీనపరచును.

"ఇతర పదార్థములన్నిటికంటె మధుసారము లెక్కలేని నేరములను, పిచ్చితనమును, బాధను, దుఃఖమును కలుగజేయును."

"త్రాగుడు, నేరము, పిచ్చితనము యివిమూడున్ను స్నేహితులని" డాక్టర్ ఫోర్బ్స విన్‌స్లో, ఎమ్. బి; యల్. యల్. డి; సి. యల్. బి. గారు వ్రాసిరి.

## మధుసారము—కామపుజీవితము.

మధుసారము దేహమునుద్రేకింప జేయుటచే మనుష్యుని కామమును వృద్ధిచేసి పాపము జేయునట్లు ప్రోత్సాహించుచున్నది. మధు

సారము మనుష్యుడు తన్నుతాను స్వాధీన పరచుకొను శక్తిని తగ్గించునందున యీకామము నెదిరించు శక్తిలేని వానిగా జేయుచున్నది.

ఫ్రాన్సు దేశమందలి ఘనులగు వైద్యులు కొందరు, ఆదేశమందు తక్కువసంఖ్య పుట్టుకలుండుటకు మధుసారోపయోగమే ముఖ్యకారణముగా నెంచిరి. ఏలననగా ప్రాణోత్పత్తి కవసరమగుకొన్ని యంకురములకుండు బలమును తగ్గించుటచే గర్భము గొడ్డు బోవునటుల జేయును.

“త్రాగుడు లేనట్టియు, యింద్రియ నిగ్రహము గల్గినట్టియు మనుష్యుడెక్కువ యుపయోగకారిగా నుండునని లార్డ్. ఫ్రెంచ్ దొరగారు చెప్పిరి.

## మనుష్యునిసహజగుణము—మద్యపానము.

“సహజగుణమన మననిజస్థితిని దెల్పును; కీర్తియన యితరులు మనలగూర్చి అనుకొనునది దెల్పును.”

దేవుని తెలిసికొనుటే హృదయమునకు ముఖ్యమైనపని. దానికంటె నెక్కుడుజ్ఞానములేదు. ప్రార్థనయనగా మనుష్యుడు తనజ్ఞానమును నుపయోగించు గొప్పసాధకమని గ్లాడ్ స్టన్ దొరగారు చెప్పియుండిరి. మధుసారము మనుష్యుని సూక్ష్మబుద్ధిని మందగింపజేసి తుదకు వాని జ్ఞానమును పాడుజేయును.

“మధుసారద్రవము లెంత తక్కువగా బుచ్చుకొనినను, బుద్ధిని, న్యాయాన్యాయ వివక్షతను, మనస్సాక్షిని, యింద్రియనిగ్రహమును నడుపు మెదడు యందలి సూక్ష్మనాడులను బలహీనపరచును.

ఇట్టిజ్ఞాన స్థానము లెప్పుడు బలహీనమైనవో అప్పుడే, దయ, సత్యము, ధైర్యము, ప్రేమ మొదలుగాగల సహజగుణములన్నియు బలహీనమైపోవును.”



## మధుసారమువలన మనస్సునందు కలుగు మార్పులు.

5-వ. నార్మన్. కెర్ జ్ఞాపకార్థముగా 1913 - సం॥ నవంబరు 8-వ తేదిని ఎడింబరో పట్టణమందు శాస్త్రప్రవీణుడగు సర్. థామస్ క్లౌస్టన్, ఎం. డి., ఎల్. ఎల్. డి. గారుపన్యాసమిచ్చిరి, అవి “బ్రిటిష్ జర్నల్ ఆఫ్ ఇనెబ్రెటి” యను పుస్తకమునందు ముద్రణమైయున్నవి. వానిలో కొన్ని భాగములు మాత్రమిచ్చట నుదహరించుటకు కుతూహలపడుచున్నాము.

“మధుసారము వలన గలుగు ఫలితములకు అధ్యాత్మవిద్య (అనగా మనస్సును పరిశోధించు విద్య) నుపయోగించి చూచినయెడల, అది మొదటిసారి అవయవములకు తృప్తినధికముగా నిచ్చును.

“జ్ఞాపకశక్తి, మధుసారము మనుష్యుని జ్ఞాపకశక్తికేవిధ సహాయము చేయకపోవుటయేగాక ఫలానికాలములో ఫలాని విషయము జరిగినదను జ్ఞాపకమును పాడుచేయ జూచును.

“శ్రద్ధ. మధుసారము మనోనిశ్చలతతగ్గించును. అందుచే నేపని మీాదగాని త్రాగువాని బుద్ధి నిలుకడగానుండదు. త్రాగుడుశ్రద్ధను తగ్గించును.

“మనోశక్తి.” మనోశక్తికిని, బుద్ధిబలములకును గలసంబంధమునుబట్టియైనను, లేదా, బుద్ధిమాలినట్టియు, హానికరములగు పనులను జేయుటకు నిరుత్సాహము గలిగించు శక్తినిబట్టియైనను మధుసారఫలితమును పరీక్షించిన యెడల నది యట్టి మనోశక్తిని తగ్గించునని నూటికి తొంబదితొమ్మిది విషయములలో దృష్టాంతపరుపవచ్చును.

“మాట” మత్తుగలిగిన యొకడు మాటలాడుట చూచిన నవియు ద్రేకము గలిగినవై పదింట తొమ్మిదిపాళ్లు పిచ్చిమాటలై యుండును.



సారాయమునమ్మువాడు తన సారాయమును త్రాగి కృశించి నశించుచున్న వానినిగూర్చి యేమాత్రము తెలుపక తియ్యనిమాటలతో పడుచువారికి సారాయము నదించుచున్నాడు.



"స్వభావము, కోరికలు. త్రాగుబోతులు సాధారణముగా మత్తు గల్గియున్నప్పుడు ప్రాణహానికైన వెనుక దీయక ఎట్టి దుష్కృతమునైనను జేయుదురు. ఇంగ్లాండు దేశములో జరుగు ఆత్మహత్యలలో నూరింటనలువది మద్యసారము వలన సంభవించినవైయున్నవి."

మద్యసారమువలన గలుగు ముఖ్య కీడులు. మద్యసారము యెండాకాలములో నెండదెబ్బ కెక్కువ సహాయము చేయును.

మద్యసారము పలువిధ దుస్స్వప్నములు కలిగించును.

మద్యసారము అకాలవృద్ధాప్యము దెచ్చును.

మద్యసారము జీర్ణశక్తిని తగ్గించును.

మద్యసారము కార్జము, (లివర్) గురదాలకు (కిడ్నీస్) (ఉవకాయలకు) నష్టము జేయును. కార్జముపైని ముళ్లు ముళ్లుగాలేచు "సైప్రైటీస్" లేక "బ్రైట్స్" అనురోగమును బుట్టించును.

మద్యసారము గుండె నిబ్బరములేక దడగలుగ జేయును.

మద్యసారము రక్తనాడులను గట్టి పరచుటచే "ఆర్టరియోస్క్లరోసిస్" అను వ్యాధిని దెచ్చును.

మద్యసారము కించిదాయుస్సుకు కారణము.

మద్యసార మత్యల్పకాలముల్లాసము నిచ్చినను అత్యల్పకాలములోన అట్టియుల్లాసము తగ్గిపోయి వానిని దుఃఖములో ముంచును.

మద్యసారము వలన చేతిపనులు చేయువారి జ్ఞాపకశక్తితగ్గును.

అదిక్షయరోగమును బుట్టించును.

మద్యసారము ఉన్మాదము గలుగజేయును.

మద్యసారము వాడుకచేయువారి దేహములు వాతరోగమునకు, అతిమూత్రరోగమునకు ఊపిరితిత్తుల వాపుగలుగు రోగములకును లోనగును. అపాయములును, శస్త్రవిద్య చేయించుకొనుటవసరములును, గొప్పవ్యాధులును మధుసారము పుచ్చుకొనువారికి వచ్చినయెడల వారుబ్రతుకుట బహు అరుదు.

ఊపిరితిత్తులవాపు (Pneumonia) రోగముగలవారు, కఫవాత రోగులును మేలుగలుగునని మద్యసారమునుపయోగించిన యెడల మేలుకు బదులుగా కీడేఎక్కువగా చేయును.

ఆస్థిపాడగుట, అపాయములు గలుగుట, నిప్పు ఉపద్రవము మున్నగు ప్రాణాపాయములకు మద్యసారమే ముఖ్యకారణమైయున్నది.

పూర్వమునుండి నేటివరకును అనేకుల కుటుంబములు మధుసారమువలన దుర్గతిపాలైనవి. కోట్లకొలది జనులు కుటుంబములు లేనివారైరి.

## చక్రవర్తులు, దేశాధికారులు, ప్రధానమంత్రులు, నాయకులు రాజ్యాంగతంత్రనిపుణులు, వైద్యులు మున్నగువారిచ్చిన సాక్ష్యములు.

1. జర్మనీదేశపు పూర్వపు చక్రవర్తి రెండవ విలియం ఓడలసేనానియగు తనచిన్న కుమారునికి 1911-సం॥లో నిట్లువ్రాసెను :— “ రాబోవు గొప్పయుద్ధమునందు ఆరోగ్యమగు నీశరీరపుష్టి యవసరమైయున్నది. నరములపుష్టియే జయమును దెచ్చును. అత్యల్పముగా మధుసారమునుపయోగించు జనాంగమే జయశాలులగుదురు. స్వలాభమును జూచుకొను వాడవుగాక యోగ్యత గలిగి దేశాభిమానమునే గలిగి యుండగోరెదను.”

2. ఇదివరలో అమెరికాయందలి యునైటెడ్ స్టేట్సున కధిపతిగానున్న థియోడర్ రూజ్‌వెల్ట్‌గారు “ అనేకులను నేరస్థులనుగా జేయునది మద్యసారమే, సారాయి అంగళ్లు పెట్టువారే శాసనముల్లంఘించువారు. సారాయి అమ్మువారిని విచ్చలవిడిగా విడిచినయెడల, వారు సంఘమునుమాత్రమేగాక రాజ్యాంగమునుకూడ దుస్థితిలోనికి దీసికొని వత్తురు” అని చెప్పిరి.



3. గౌరవార్హులగు లాయడ్ జార్జిగారు గత ఐరోపా మహాయుద్ధ కాలములో “ మేము జర్మనితోను ఆస్ట్రియాతోను త్రాగుడుతోను పోరాడుచుంటిమి. ఈముగ్గురిలో త్రాగుడే గొప్పశత్రువైయున్నది. సముద్రములో మునిగివచ్చు జర్మనీ యోడలకంటె త్రాగుడు యీయుద్ధమునందెక్కువనష్టము కలిగించుచున్నద” ని చెప్పిరి.

4. మైకములేని సైన్యమేజయమునొందును, శత్రువునకంటె ద్రాక్షరసమునకెక్కువ భయపడవలయును.” అని నాపోలియన్ బోనపార్టు చెప్పెను.



(1) సారాయము నమ్మువాడు నీ సొమ్మును, ప్రాణమునుకూడా అడుగుచున్నాడు.

(2) కాని దొంగ నీ సొమ్మును మాత్రమే అడుగుచున్నాడు.

5. "మధుసారము న్యాయాన్యాయ వివక్షతలేకుండ జేయును. త్వరగా ఆయాసము గలుగజేయును. వ్యాధిగల్గినపుడు తాళలేకుండ జేయును" ఫీల్డ్. మార్షల్. లార్డ్. రాబర్ట్సు. వి. సి., కె. జి., కె. పి. ఫీల్డ్ మార్షల్. లార్డు వొల్సెలీ. కె. పి., జి. సి. పి.

6. గత ఐరోపాయుద్ధ కాలములో జర్మనీదేశపు కౌంట్. వాన్. మాల్టె కె. గారిట్లు చెప్పిరి :— "ఫ్రాన్సుదేశపు సైన్యములు చేయు నాశనమునకంటె బీరు సారాయి జర్మనీవారి కెక్కువనాశనము కలిగించుచున్నది."

7. యునైటెడ్ స్టేట్స్ ఓడల సైనికులు మద్యసారము మానవలయునని ఆజ్ఞనిచ్చునప్పుడు సెక్రటెరి డానియల్సుగారు "ప్రస్తుతయుద్ధనావలమీద విద్యుచ్ఛక్తి ఆవిరి యంత్రములుండుటచేత వాటిని స్వాధీనమందుంచుకొనువారు యెట్టిమత్తు పదార్థములకైన పాలుబడకుండుట ముఖ్యమైన విషయమ"ని చెప్పిరి.

8. ఘనత వహించిన చక్రవర్తిగారి ముఖ్యవైద్యులగు సర్. ఫ్రెడరిక్ ట్రీర్డు, బాౙ్ జి. సి, వి. సి, ఎల్, ఎల్. డి., యస్. ఆర్. సి యస్. సర్జంటుగారిట్లనిరి :— "మద్యసారము వలన గలుగు ఫలితము కొంచెముల్లాసము గలిగినను, అట్టియుల్లాసమల్పకాలముండి, అదిపోగానే మనుష్యుని బలహీనునిగా జేయును. ఎట్లనగా మధుసారము దేహమంతటిలోనున్న బలమున కొక్కసారియే పనికల్పించి, ఆబలము పోగానే అల్పకార్యమైనను చేయశక్తిలేనివారినిగా జేయుచున్నది" అని చెప్పిరి.

9. "మధుసారము మొదట కొంచెము చురుకుగలదైయుండినను దాని సత్తువతగ్గుముఖము అధిరక్తములోనికి గ్రహించబడినపుడు రక్తము త్వరగా ప్రవహించునట్లు జేసి నరసముదాయము యొక్కయుద్రేకమును తగ్గించును గాన నరములు మునుపటిరీతిగా ఉత్సాహము లేనివైయుండును. ఇట్లు దేహబలమును, బుద్ధిని మొద్దుపరచి, దానియధికారము క్రిందనుండు వానిని తనదేహమునకుగాని మనస్సునకు



గాని యెట్టిస్థితి గలిగినదో గ్రహింపలేకుండజేయును" అని సర్. లాడర్. బ్రుంటన్. ఎం. డి., ఎఫ్. ఆర్. యస్ గారుచెప్పిరి.

10. "అజీర్ణమువలన పొత్తికడుపులో పుట్టెడునొప్పికి మధుసారమేముఖ్యమైన ఔషధమని తలంచుట బహుగొప్ప పొరబాటు. జఠరసంబంధమగు నరములనదిస్మృతి తప్ప జేయుటచే నొప్పి తగ్గినట్లుండునేగాని అదినిజముగా నొప్పినితీసివేయజాలదు, తీసివేయుటకు బదులుగా హెచ్చించును" సర్. విక్టర్ హార్స్లె.

11. "మధుసారమెంత మితముగానుపయోగించినను మనుష్యుని అల్పాయుస్సుగలవానిగా జేయుననుట నిస్సందేహమ"ని సర్. అల్ఫ్రెడ్. పియర్సు. కె. సి., వి. సి., ఎం. ఎస్. గారు చెప్పిరి.

12. "క్షయరోగమునకు మధుసారము కొంచెముపశాంతి కలుగజేయునని పూర్వము తలపబడినను యిటీవల, అదిశాంతినిచ్చుటకు బదులు సహాయము చేయుననియు, అపరిమితముగా త్రాగువారికి శ్వాసకోశములలో పుట్టెడుక్షయరోగము ఒక దీర్ఘవ్యాధిగా నేర్పడుటనిస్సందేహమ"ని సర్ విలియం. ఆస్లర్. ఎం. డి. గారనుడివిరి.

## మధుసారము ఔషధముగా నుపయోగించుట.

పూర్వము అనేకవైద్యశాలలలో శస్త్రముచేయబడిన పిమ్మటను, అత్యావసరములైన సమయములలోను, కాయిలాలలోను బ్రాంది లేక మరొక మత్తుపదార్థమును కొద్దిగానిచ్చువాడుక కలదుగాని యిప్పుడా యలవాటొక పొరబాటని పరిశోధనలచే గ్రహించి యున్నారు. గుండెకొట్టుకొనుట ఆగునప్పుడును, ఊపిరించుట నిలిచినప్పుడునున వాసాగరము మంచిఔషధముగా తలపబడెను. ఒక మనిషినిస్త్రాణిచే మూర్ఛిల్లినప్పుడు కొంచెము బ్రాందినిచ్చుట చాలాకాలము వరకొక యలవాటైయున్నను, యిటీవల నదికూడ నొక పొరబాటైయున్నదని కనుగొనబడెను. అట్టివ్యాధులనివారించుట కింతకంటే శ్రేష్టమైనట్టి పద్ధతులు గలవు. మూర్ఛిల్లిన మనిషిని త్వరగా తెప్పరిల్ల జేయవలెనం



ఈత్రాగుబోతు తాను సంరక్షణ చేసి ప్రేమింపవలసిన తనభార్య బిడ్డలనుబహు నీచమైన తిట్లు తిట్టి కొట్టుచున్నాడు.

సారాయమును బహుగా త్రాగినందున చనిపోయేస్థితిలోనున్న వానిని, వానిభార్య బిడ్డలను సారాయమునమ్మువాడు తనసారా లెక్క-బాకీలు వెంటనే తీర్చవలసినదని పీడించుచున్నాడు.

టే వానిని మంచిగాలిగల చదునైన నేలమీదనైనను, గట్టిపడక మీదనైనను వెలికిలగా పరుండబెట్టి వాని మెడ, రొమ్ము, నడుము వీనినికప్పి యుండెడుబట్టలను వదులుచేయవలెను. కొంచెము నీళ్లుగాని, పాలుగాని గుటక వేయునట్లు చేసినయెడల గుండె చేయుపనికి చురుకు పుట్టించును.

ఆస్ట్రేలియాలోని డాక్టర్ హ్యూ, ఎల్, మర్రెదొరగారిట్లు చెప్పిరి. "25 సం॥ క్రిందట మధుసారము వైద్యమునందు నిరాటంకముగా నుపయోగించబడెనుగాని యిప్పటి ఔషధ శాస్త్రమునందు దాని నొక మందుగా బహు అరుదుగా చెప్పబడియున్నది. మెల్బోరన్ వైద్యశాలలో 1891-వ సం॥ 1047 పౌనులు (రూ. 15,705) అనగా వ్యాధికుదురువరకు వైద్యశాలలోనే యుండువారికొక్కొక్కరికి 5 షిల్లింగుల (రూ. 3-12-0) చొప్పున మధుసారము కొరకై వ్యయపర్చబడెను. 1914-వ సంవత్సరములో పౌ 4-12 షి (రూ. 69) అనగా 16 మంది రోగుల కొక్కపెన్ని చొప్పున ఖర్చుపెట్టబడెను. వైద్యులు దాని యుపయోగమునే బొత్తుగా వదలివేసిరి.

"ఇరువది సంవత్సరముల క్రిందటనే యార్క్ పట్టణమునందలి బెల్వ్యూ వైద్యకళాశాలలో తర్ఫీతు నొందుచుండగా వైద్యమునందు నిపుణులగు వారు మధుసారము ఊపిరితిత్తులవాపు, కఫవాతజ్వరము, క్షయదగ్గు మొదలగు వ్యాధులకుపయోగమగు మంచియౌషధమని నేర్పిరి. ప్రస్తుత కాలపునాగరికత గలయేవైద్య పాఠశాలయందైన నొకయుపాధ్యాయుడట్టి యూహను వెల్లడి పరచిన యెడల తనసహాధ్యాయులవలన నిశ్చయముగా నవహాసింప బడున"ని డాక్టర్ డేవిడ్ పాల్‌సన్ ఎం. డి. గారు చెప్పిరి.

వైద్యశాస్త్రమందే యేమూలికలను గూర్చిన సంగతులను చేర్చవలయునను విషయమును చర్చించుటకై 10 సంవత్సరముల కొకసారి చేరువైద్య శాస్త్రప్రతినిధులకు అగ్రాసనాధిపతిగా నుండు హార్వి వైలీ యను డాక్టరుగారు "వైద్యశాస్త్ర వేత్తలలో ఘనులగు వారు మధు



సారము బలకారియగు నొకయౌషధము కాదనియు, యిప్పుడైనను యికనెప్పటికైన నట్టియౌషధముగానుండ బోదనియు పరిశోధించి నేకగ్రీవముగా చెప్పిరి. అదిసాధారణమైనట్టి మత్తును గలుగజేయును. స్మృతితప్ప చేయుటయే దానియందు బలకరమైన పనియని యనుకొనవచ్చును. విస్కీ, బ్రాందియును ప్రస్తుతము వైద్యశాస్త్రమునుండి



సారాయమును త్రాగువారు సైతానుకు బానిసలై యున్నారు.

వేరుచేయబడినవి. ఇట్టి సారాయములు బొత్తుగా నిరుపయోగములున్ను నిశ్చయముగా హానికలిగించునను యీసుప్రసిద్ధమైన సిద్ధాంతమును ప్రపంచమునకంతకును వెల్లడిచేయుదమని" చెప్పినట్లు 1920-

సం॥ సెప్టెంబరునెల 18-వ తేదిన ప్రచురింపబడిన "లిటరరీడైజస్ట్" అనుపత్రిక చెప్పుచున్నది.



త్రాగుబోతు తనసొమ్మునంతయు త్రాగుటకొరకు ఖర్చుచేయుచుండును, అతని భార్యాబిడ్డలు ఆకలిచే బాధపడుదురు.

## శీతోష్ణదేశములలో మధుసారపు ఉపయోగము.

హార్స్లి, స్టర్జ్ గార్లవలన వ్రాయబడిన మధుసారమును మనుష్యదేహమును" అనుపుస్తకములో "మద్యసారము ప్రతిదినముపయోగించుటకొరకైనది కాకపోయినను నావికులు ఔషధముగాదాని



నుపయోగించవచ్చుననియు అట్టిది అవసరమైన ఔషధమేయనియు యెవరైననొకరు నిరూపించినయెడల నేను దానికొప్పుకొన సిద్ధముగానున్నాను. అట్టిసంగతి నిరూపించబడువరకున్ను ధ్రువములకునావప్రయాణము చేయువారి కవసరమగు వస్తుసముదాయములలోనుండి మధుసారము నెత్తివేయుటయుత్తమమైనదని" ధ్రువపరిశోధకులగు డాక్టర్ నాప్సన్ గారు వ్రాసిరి.

హిందూదేశమందలి యూరోపియనులు మధుసారము యిచ్చటి వేడిమికిని యిచ్చటనుండు మన్యపు జ్వరములకున్ను బహు అనుకూలమని యిదివరకు తలంచిరి. ఇదిపొరబాటైయున్నది. మధుసారము చలిదేశములలో దెచ్చువ్యాధులనే ఉష్ణదేశములందును గలుగజేయును. మన్యపుజ్వరము దెచ్చు దోమలు మధుసారము వాడుకచేయువారి నెట్లుపీడించునో ఆలాగుననే అట్టివాడుకలేని వారిని కూడా పీడించును. ఇంతే కాకుండా మధుసారము త్రాగుటవలన రోగ



జనులుపనిచేయుమరలలో త్రాగుబోతులకు బహుగొప్ప అపాయములుకలుగుచుండును.

మునెదిరించు శక్తిదేహము నందుండకుండుటయేగాక రోగాంకురములు దేహమునం దెగబ్రాకచేయును.

**మధుసారమును గూర్చి మతగ్రంథములేమి చెప్పుచున్నవి.**

హిందూదేశమందున్న క్రైస్తవ, హిందూ, మహమ్మదీయ, బౌద్ధమతములన్నియు మద్యపానము చేయుట తప్పని ఖండితముగా చెప్పుచున్నవి. క్రైస్తవ వేదమగు బైబిలు ద్రాక్షారసముగాని మరే యితర మత్తుపదార్థముగాని పుచ్చుకొనకూడదని ముఖ్యముగా చెప్పుచున్నది.



రెండుమార్గములు. ఒకటి అనుమానకరమైన త్రాగుడు, రెండవది సంతోషకరమైన సంసారము, ఏదానికోరుదువు ?

"ద్రాక్షారసము వెక్కిరింతలపాలు జేయును. మద్యము అల్లరి పుట్టించును. దానివశమైన వారందరు జ్ఞానములేనివారు" (సామితెలు 20 : 1).



"త్రాగుబోతులును, తిండిబోతులును దరిద్రులగుదురు. నిద్రమత్తు, చింపి గుడ్డలు ధరించుటకు కారణమగును" (సామితెలు 23 : 21).

"ఎవరికి శ్రమ ? ఎవరికి దుఃఖము ? ఎవరికి జగడములు ? ఎవరికి చింత ? ఎవరికి హేతువులేని గాయములు ? ఎవరికి మందదృష్టి ? ద్రాక్షారసముతో ప్రొద్దుపుచ్చువారికేగదా ! కలిపిన ద్రాక్షారసము రుచిచూడ చేరువారికేగదా ! ద్రాక్షరసము మిక్కిలి ఎఱ్ఱబడగను, గిన్నెలో తళతళలాడుచుండగను, త్రాగుటకు రుచిచూచుచుండగను దానివైపు చూడకుము. పిమ్మటనది సర్పమువలెకరచును. కట్లపాము వలె కాటువేయును" (సామితెలు 23 : 29—32).

"ద్రాక్షరసము త్రాగుట రాజులకు తగదు. లెమూయేలూ అది రాజులకు తగదు. త్రాగిన యెడల వారు కట్టడలను మరతురు. దీనులందరికి అన్యాయము చేయుదురు." (సామితెలు 31 : 4-5.)

"దేశమా ! నీరాజు గొప్పయింటి వాడైయుండుటయు నీయధిపతులు మత్తులగుటకు కాకబలము నొందుటకై అనుకూలసమయమున భోజనమునకు కూర్చుండు వారైయుండుటయు నీకు శుభము" (ప్రసంగి 10 : 17).

"మరియు యెహోవా అహరోనుతోనిట్లనెను :—మీరు ప్రత్యక్షపుగుడారములోనికి వచ్చునప్పుడు మీరు చావకుండునట్లు నీవును నీకుమారులును ద్రాక్షరసమునేకాని మద్యమునేకాని త్రాగకూడదు. మీరు ప్రతిష్ఠించినదానిని లౌకికమైనదానిని, అపవిత్రమైనదానిని, పవిత్రమైనదానిని వేరుచేయుటకును"—లేవికాండము 10 : 8—10.

"తమపొరుగువారి మానము చూడవలెనని ఘోరమైన యుగ్రతను కలిపి వారికి త్రాగనిచ్చి వారిని మత్తులనుగా చేయువారికి శ్రమ" హాబక్కూకు 2 : 15.

"మద్యము త్రాగుదమని వేకువనేలేచి ద్రాక్షరసము తమకు మంటపుట్టించు పర్యంతము చాలరాత్రివరకు పానము చేయువారికి శ్రమ, యెషయా 5 : 11.

"ద్రాక్షరసము త్రాగుటలో ప్రఖ్యాతి నొందినవారికిని మద్యము కలుపుటలో తెగువగలవారికిని శ్రమ," (యెషయా 5 : 22).

"మరియు మద్యముతో మత్తులైయుండకుడి, దానిలో దుర్వ్యాపారము కలదు.' (ఎఫెసీ 5 : 18)

హిందువుల పురాతన చట్టములును (మనుచట్టములను చూడుము) మహమ్మదీయుల (ఖురాన్) చట్టములును యిట్టిదానిని గూర్చియే బోధించుచున్నవి. గౌతమ బుద్ధుడు తన్ను వెంబడించువారు పరిశుద్ధమైనట్టియు నెమ్మదిగల బ్రతుకుబ్రతుకవలెనంటె త్రాగుడు బొత్తుగా నంటకూడదని బోధించెను.



మరణమును త్రాగుడును బహుగొప్పస్నేహితులై యున్నారు.



హిందూచట్ట నిర్మాణకులు త్రాగుడు మహాపాతకమనియు అదిదాదాపుగా నరహత్యతో సమానమైన పాపమనియు చెప్పినట్లు సర్ బాలచంద్రకృష్ణ, కె. టి. ఎల్. ఎం. గారు చెప్పిరి.

సంస్కృత భాషలోనున్న హిందూశాస్త్రము లిట్లుబోధించుచున్నవి :—

"మద్యం, అథేయం. అపియాన్. అగ్రజ్యాన్" అనగా మద్యము యిచ్చుటను, త్రాగుటను లేక పుచ్చుకొనుటను కూడదు.

## కలకత్తాలోనున్న సర్ లియోనార్డ్ రాజర్స్‌గారి సాక్ష్యము.

"హిందూదేశమునకు మధుసారమొక పిశాచము"ను పుస్తకములో 29-వ. పుటనుండి ఎత్తివ్రాయబడినది.

"కలకత్తాయందలి మనదేశీయులకుగల్గు కాలేయమువుండవ్యాధులలో నూరింటదెబ్బది మధుసారమువలననే గలుగుచున్నట్లు చరిత్రలు తెల్పుచున్నవి. ఈవ్యాధి ముఖ్యముగా హిందూస్త్రీలకంటె మహమ్మదీయస్త్రీలలో నెక్కువగా కనుబడుచున్నది. ఏలననగా పురుషులకంటె స్త్రీలు తక్కువ త్రాగుబోతులు. గొప్పపట్టణములలో నీవ్యాధి బహు తరుచుగాగలదుగాని యీ వ్యాధి యిదివరలో స్వదేశస్థులలో కంటె విదేశీయులగు యూరోపియనులలో నెక్కువగా కనుబడుచుండెనని ఎన్నెస్లీ అర్వింగ్ గారు వ్రాసిరి. ప్రస్తుతము స్వదేశస్థులలో నిట్టివ్యాధి వృద్ధియగుట చూడగా వీరు మధుసారమెక్కువగా నుపయోగించుచున్నారని స్పష్టమగుచున్నది."

## మధుసారముయొక్క వాడుక.

గ్రేటుబ్రిటన్ :—"డేయిలి ఎక్స్‌ప్రెస్" అనునొక పత్రికలో లార్డ్. లివర్ హెల్మ్యామ్. అనునాయన "మనము

మద్యమునకై ప్రతిసంవత్సరము మనదేశములో పౌ. 46,00,00,000లు (రూ: 690 కోట్లు) వ్యయముచేయుచున్నామ"ని వ్రాసెను.

**అమెరికా**:—"టైటానిక్" అనుయోడ 1503 మందిని మాత్రమే సముద్రమునందు ముంచెనుగాని సారాయివ్యాపారము యునైటెడ్ స్టేట్సులో నెనిమిది దినములలో 1503 రినెత్తుకొని పోయెను. అనగా ఒక సంవత్సరములో దాదాపునలుపది టైటానిక్ యోడలు మునిగిపోయినంతటి నష్టము కల్గుచున్నది."

**ఇండియా**:—స్వదేశ మద్యములను జూడగా నివి విదేశ సారాయములవలె బట్టిపెట్టి దించబడి వాడబడచున్నవి. ఇట్టివానిని వాడుటయందు బొంబాయిరాజ్యము మొదటిది, మధ్యపరగణాలు రెండవది, సింధుదేశము మూడవది, సంయుక్త పరగణాలు నాల్గవది, చెన్నరాజ్యము ఐదవది, బంగాళారాజ్యము ఆరవది, పశ్చిమోత్తర పరగణాలు యేడవది, తూర్పు బంగాళా, అస్సాము రాజ్యములు యెనిమిదవవిగా నుంటున్నవి" అని నరేంద్రనాత్ సేన్‌గారువ్రాసిరి.

## త్రాగుడుపిశాచచర్య.

ఎలి. పెర్కిన్స అనునామె యీ విధముగా జెప్పెను :—డెన్వర్ పట్టణములో నొకసారాయి అంగడియందు కొందరందమగు యౌవ్వనులు కూడినవ్వుచు ప్రేలుచు సారాయిత్రాగుచుండగా నొక భిక్షుకుడచ్చటికి వచ్చి తలుపు నోరగాదీసి దీనదృష్టితో నాయౌవనులను జూచెను.

అంతవారాతని పిలిచి "ఓయీ ! లోపలికివచ్చి నీవునుకొంచెము త్రాగిమైమరచి మావలె నుల్లాసముగానుండు మ"ని సంతోషముతో పిలచిరి.

అతడు వందనములాచరించుచు "అయ్యావచ్చెదను. మితిమీరిన యాకలిచే నాదేహమంతయు నిప్పుడుచల్లబడియున్నది." అనిచెప్పు చూలోనికివచ్చి కొంచెము సారాయిత్రాగి వారి సంతోషముతో




సకాలమందలి హెచ్చరిక.

" ఓ పడుచువాడా ! నేనొకప్పుడు కావలసినంత ధనము, మంచి ఆహారము, విలు

హైనవస్త్రములు, చాలామంది మిత్రులతోనుంటినిగాని పాడుత్రాగుడు వలన నాకున్న యాపత్తును చివరకు నాబలమును పోగొట్టుకొంటిని. నన్నుచూచి, త్రాగుడుయొక్క గొప్పకీడును తెలిసికొని జాగ్రత్తగలిగియుండుము."

తానున్న పాలోనియున్నట్లు నటించి వారిముఖములు కొంచెము తేరి పారజూచి వారిక్షేమముగోరిన వానివలె విచారముఖముతో నిట్లని యెను :—అయ్యలారా ! కొన్ని సంవత్సరములక్రిందట నేనెట్టిస్థితిలో నుంటినో మీరిప్పుడట్టి స్థితిలోనున్నారు. మీరును నేనును చేరి, నాబ్రతుకొక చిత్తరువేయైనయెడల నేటితో దానిని ముగించి యుంటిమి. నా యావనస్థితిలో నేనొక యధికారినైయుంటిని. ఇప్పుడు మీరు చూచు యీ నా వికార ముఖ మిదివరలో మీముఖములవలె కోమలమైయుం డెను. నేనిదివరకు మంచిగృహమున్ను స్నేహితులనున్ను గలిగి మంచిస్థితియందుంటిని. నేర్పరియైనయే చిత్రకారుడైన తనకలలో సహా జూచియుండ నంతటి సౌందర్యముగల భార్యయుగలదు. అట్టియామె కుగల అమూల్యమైన మర్యాదయనెడి ముత్యమును నేనీమద్యమునందు గలిపిత్రాగివేసి దానిని తుదముట్టించితిని. వసంతకాలమందలి పుష్ప ములవలె మనోహరులగు నా బిడ్డలు త్రాగుబోతు తండ్రినైన నాదుశ్చేష్టలచే నాకండ్ల యెదుటనే దాటిపోయిరి. నాకొక ఇల్లుగలదు. అందు ప్రేమయనే యొకజ్యోతిని వెలిగించి దానిదగ్గర పరిచర్యచేసి చివరకు నేనాజ్యోతిని ఆర్పివేసితిని. అందుకుబదులుగా చీకటియు, దుఃఖమును నాయింట రాజ్యము జేయుచున్నవి. వేకువచుక్కనంటు నంతటి గొప్పయాశలు, తలంపులు నాకుండినను, వానినెన్నటికిని నాయొద్దకు రాకుండ జేయుటకై పెడరెక్కలు విరిచి కట్టితిని. నేడు చూచితే నేను సతిలేని పతివలెను, పిల్లలులేని తండ్రివలెను, నాదని చెప్పుటకైనను యిల్లువాకిలిలేని దేశదిమ్మరినై బ్రతుకన్న యాశలేక యుంటిని. నాకుకలిగినది యాపత్తును త్రాగుడను సుడిగుండములో పడవేసితిని."

"యౌవనులారా ! మీ మీతల్లులు, భార్యాబిడ్డలు చేయుప్రార్థనల పెడచెవినిబెట్టక, మీవలనవారికిహపరములందు గలుగు సంతోషము



లలో మీరును పాలివారై యుండగోరెదరా లేక నావలెనిర్భాగ్యులై విచారమందు మునిగి యుండగోరెదరా ? ఇప్పుడే యాలోచించు కొనుడు. నామట్టుకు నాకు మీరు సన్మార్గముతోనిండి సద్గుణములు గలవారై యుండవలెననియే నాకోరిక." అని చెప్పుచూ మెల్లగా నడచి యవతలకు బోయెను." (Selected).

# హిందూదేశమందలి మధుసారమును మత్తుగలుగజేసెడి కొన్ని మూలికలును.

కొందరువైద్యులచే జెప్పబడినవి :—

ఈ క్రింది సంగతులన్నియు ఆంగ్లో - ఇండియన్ మితానుభవకూట మువలన నేర్పరచబడి హిందూదేశమందును గ్రేటుబ్రిటనులోనున్న గొప్పవైద్యులచే నామోదింపబడి, యీదేశములో ప్రచురింపబడి శాస్త్రీయముగాను అనుభవరీతిగాను నిరూపింపబడినవి. అవేవనగా:—

1. మధుసారమును, మత్తుమందును (cocaine) నల్లమందును మూలికసంబంధమగు (భంగు, గెంజాయి మొదలగు) మత్తుపదార్థము లును విషతుల్యములైయున్నవి.

2. ఎంతమితముగా పుచ్చుకొనినను ముఖ్యముగా హిందూదేశ మువంటి యుష్ణదేశములలో త్రాగుడు అపాయకరమైయున్నది. శరీరసం బంధమైనట్టియు, బుద్ధి సంబంధమైనట్టియు బడలికను సారాయము లెంత మాత్రమును తీసివేయశక్తిగలవికావు.

3. ఎన్నడైనను మత్తుపదార్థములను రుచిచూడకయు వానినే విధముగానైన నుపయోగింపనివారు మిక్కిలి యోపికపరులును, అంటువ్యాధినిగాని, సాధారణమగు జబ్బునుగాని నిగ్రహించుటకు సమర్థులగుచున్నారు.

4. మధుసారము, దాని నుపయోగించు వారికేగాక వారి తరువాత వారిపిల్లలకుగూడ మేహసంబంధమగు వ్యాధులను బుట్టించును.

5. కరవులు సంభవించుటకు మధుసారమొక ముఖ్యకారణమై యున్నది.

6. మధుసారము బొబ్బల తెగులు (Plague) నందేమాత్రము పనినైన జేయజాలదు.

7. మధుసారము మనదేహములు మన్యపుజ్వరము క్షయరోగములకు త్వరగాలోబడునట్లు చేయుచున్నది.

8. మధుసారమందలి యీ దుర్గుణములే నల్లమందు మొదలగు మత్తుపదార్థములలోనున్నవి.

9. ఇట్టి దుర్వ్యాధులకు లోనైయుండిన మనదేశస్థులను మతసంబంధముగాను, స్నేహసంబంధముగాను, వీనినివదలి వేయుడని మన సుందరము మనవి చేయుదుముగాక.

పై ప్రకరణ యీ దిగువవారిచే నామోదింపబడినట్లు సంతకము చేయబడెను :—

జి. జె. ఎచ్. ఇవాట్. సి. బి., ఎం. డి. సర్జన్. జనరల్ ఆల్ఫ్రెడ్ పీయర్స్ గోల్డ్, కె. సి. వి. ఓ., ఎం. ఎస్. (వైస్ కౌన్సిల్లర్ ఆఫ్ ది యూనివర్సిటి ఆఫ్ లండన్) సి. డబ్ల్యు. సాలీబై. ఎం. డి., ఎఫ్. ఆర్. యస్. (ఎడిన్) ఫ్రెడరిక్. ట్రేవిజ్, జి. సి. వి. ఓ., ఎఫ్ ఆర్. సి. యస్. (స్జెంట్ - సర్జన్ యిన్ ఆర్డినెరి టు ది. కింగ్., జి. సిమ్స్ వుడ్ హెడ్. ఎం. డి., ఎల్. ఎల్. డి., ఎఫ్, ఆర్ యస్. (ఎడిన్.) (ప్రొఫెసర్ ఆఫ్ పాతాలజి ఎట్. ది యూనివర్సిటి ఆఫ్ కేంబ్రిడ్జి), లెఫ్టినెంట్ కర్నల్. ఆర్. ఎ. ఎం సి. బాలచంద్ర క్రిష్ణ, కె. టి., ఎల్. ఎం, (బొంబాయి) జిర్వాజ్. ఎన్. మెహ్టా ఎం. డి., ఎం. ఆర్. సి. పి. (లండన్) (బొంబాయి) డేవిడ్ సి. ముత్తు, ఎం. డి, ఎం. ఆర్. సి. యస్., ఎల్. ఆర్. సి. పి. (ఛీఫ్. ఫిజిషియన్, మెండిప్ హిల్స్, సానిటోరియం). ఆర్థర్. లంకాస్టర్, ఎం. డి. (లండన్) (స్పెషల్ టూబర్ క్యులాసిస్ ఇంక్వైరీ, ఇండియా) ఎచ్. జె. వాల్టర్ బారో, కర్నల్



(లేట్. పి. ఎం. ఓ., 3-వ. (లాహోర్.) డివిషన్). వి. ఎచ్. రుదర్ ఫోర్డ్. ఎం. ఏ. ఎం. బి. (కాంటాబ్). జె. కె. ఆద్య, ఎం. బి. (కలకత్తా) ఎం. ఆర్. సి. యస్., ఎం, ఆర్, సి. పి. (అసిస్టెంట్ - రెసిడెంట్, ఎం. ఓ. లండన్ టెంపరెన్సు హొటల్), డి. వార్ లికార్. ఐ. ఎం. ఎస్. లెఫ్టినెంట్ కర్నల్. నిల్ రతాన్ - సర్కార్. ఎం. ఏ., ఎం. డి. ఎఫ్. సి. వి. (మెంబర్. బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్) చునిలాల్ బోస్, ఐ. సి. ఓ., ఎం. బి., ఎఫ్. సి. యస్., ఎఫ్. సి. వి., (అఫీషియేటింగ్. కెమికల్ ఎగ్జామినర్, బెంగాల్ అండ్ ప్రొఫెసర్ ఆఫ్ కెమిస్ట్రీ, మెడికల్ కాలేజి, కలకత్తా) ఎస్. కె. మల్లిక్. ఎం. ఎస్., ఎం. డి. (ఎడిన్), (ప్రిన్సిపాల్ నేషనల్ మెడికల్ కాలేజి ఆఫ్ ఇండియా, సీనియర్ పి జి షి యన్, కింగ్స్ హాస్పిటల్, కలకత్తా) బి. సి. ఘోష్. ఎం. ఎ., ఎం. బి., బి. సి. (కాంటాబ్) (ఫిజిషియన్ & లెక్చరర్ ఆఫ్ మెడిసిన్, ఆల్బర్ట్ విక్టర్ హాస్పిటల్; యూనివర్సిటి లెక్చరర్ ఇన్ ఎక్స్పెరిమెంటల్ ఫిజియాలజి, కలకత్తా) ఎచ్. ఎన్. ఘోష్. ఎం. డి., ఎఫ్. సి. వి. (టీచర్ ఆఫ్ మెటీరియామెడిక, కాంబెల్ మెడికల్ స్కూలు, & ఫిజిషియన్ కాంబెల్ హాస్పిటల్ కలకత్తా) బి. సి. రాయ్, బి. ఎ., ఎం. డి. (కలకత్తా) ఎం. ఆర్. సి. పి. (లండన్) ఎఫ్. ఆర్. సి. యస్. (ఇంగ్లా) ఎఫ్. సి. వి. (ఫెల్లో ఆఫ్ ది రాయల్ సొసైటి ఆఫ్ మెడిసిన్ (లండన్) లెక్చరర్, కాంబెల్ మెడికల్ స్కూల్ & హాస్పిటల్). యు. ఎన్. బ్రహ్మచారి. ఎం. ఎ., ఎం. డి., పి ఎచ్. డి., ఎఫ్. సి. వి. ఫెల్లో ఆఫ్ ది రాయల్ సొసైటి ఆఫ్ మెడిసిన్. (లండన్) టీచర్ ఆఫ్ మెడిసిన్, కాంబెల్ మెడికల్ స్కూల్; & ఫిజిషియన్. కాంబెల్ హాస్పిటల్, కలకత్తా) ఏడి. యన్. మైత్ర. ఎం. బి., (రెసిడెంట్ సర్జన్, మేయొ హాస్పిటల్, కలకత్తా) పి. కె. ఆచార్జి, ఎం. ఎ., ఎం, బి. (కలకత్తా) పరశరామ్ ఘర్మ, ఎల్. ఎం. ఎస్. (నేటాల్) గోల్డుమెడలిస్టు, ఫిరోజ్‌పురము, జేమ్సు ఎం. మెక్ఫేయిల్, ఎం. ఎ., ఎం డి., (బరోడా) అర్నెస్ట్ జి. నీవ్, ఎం. డి., ఎఫ్. ఆర్. సి. యస్. ఇ. (మిషన్ హాస్పిటల్, కాశ్మీరము) డబ్ల్యు. జె. వాన్లెస్. ఎం. డి., (ఫిజిషియన్ ఇన్ చార్జి, మిషన్ హాస్పిటల్, మిరాజ్) ఎం. ఎస్. మల్లిక్,

# ఆరోగ్య శత్రువులు.



# ENEMIES OF HEALTH.

గ్రంధకర్త లాల్. గోపాల్. మహాపాధ్యాయ.





1922.

సెవెంత్ డే ఆడ్వెటిస్టు పబ్లిషింగ్ హౌస్,

రోడ్, లక్నో.

రోడ్, బెంగుళూ




బొంబాయి పురనివాసులును సకల హిందూదేశ మితానుభవ సభకు మెంబరులును, బొంబాయి మితానుభవ సభకు డైరక్టరులునగు డాక్టరు, సర్ బాలచంద్ర కృష్ణ భత్వాదీకరుగారు చెప్పునదేమనగా :—

“ నేను నలుబది సంవత్సరములనుండి ఔషధాభ్యాసములు చేయుచున్నానుగాని యీకాలమంతటిలో నేనెంతమాత్రమును మత్తుద్రవములను పుచ్చుకొనియుండలేదు. అంతేగాక నాయొద్దకు ఔషధ సేవనిమిత్తము వచ్చువారికి సారాయములను పుచ్చుకొనుట చాలా అపాయమని హెచ్చరించుచుంటిని.

“ నేను యీ బొంబాయిలో యన్నోయేండ్లనుండి పనిచేయుచున్నాను. ఈ కాలమంతటిలో మత్తుపదార్థములను ఉపయోగించినందున తమప్రాణములను పోగొట్టుకొనుట యేగాక తమకుటుంబములను గొప్పదుఃఖసముద్రములో ముంచినట్టి అనేక దేశీయులను నేను చూచియున్నాను.”

డాక్టరు సర్ బాలచంద్ర కృష్ణ భత్వాదీకరు.



సర్ దేవ ప్రసాద్ సర్వాధికారిగారు చెప్పినదేమనగా :—

“ మితానుభవ సంబంధముగా పనిచేయు వారంతా ప్రతియొక్కొక్కరియందును, రాజ్యమునందును, ప్రపంచమంతటను పునర్జీవము కలుగవలెనని యుద్దేశించుచున్నారు. మితానుభవము లేనందున కలుగుచున్న కీడులను ఎదిరించుట ఎంతమాత్రముచులకని పనియని వారు తలంచుటలేదు.

“ పలువిధ శిల్పశాస్త్రవిద్యలయందు గణ్యతకెక్కి ప్రకాశించుచున్న మన మగధప్రాంత్యమందు మత్తుద్రవములను, కొకేన్ వంటి అపాయకర మందుసరకులను ఉపయోగించకుండా వాటిని మానుకొనుటకు మనము పోరాడవలసియున్నాము.

“ సారాయము, యితర మత్తువస్తువులను ఉపయోగించుట వలన కలుగు అపాయములనుగూర్చి జనులకు నేర్పుట బహు అవశ్యక కర్తవ్యమై యున్నదని మనము జాగ్రత్తగా జ్ఞాపకముంచుకొన దగియున్నది.”

సర్ దేవ ప్రసాద్ సర్వాధికారి.



టి. సదాశివ అయ్యర్.

చెన్నపురి మితానుభవ బందుకట్టుప్రయత్నమునకు ప్రెసిడెంటు అగు ది. ఆనరబిల్ సర్ టి. సదాశివ అయ్యర్ గారు చెప్పునదేమనగా :—

“ సారాయమును మొదట మితముగా పుచ్చుకొనినందున దేహమునందలి కండరములును, మెదడును, అప్పటప్పటికి బలముపొందినట్లుగా తోచుట నిజమేగాని ప్రవీణులైన వైద్యులవలనను, ఆయా గొప్ప చరిత్రకారులవలనను, అనేక అనుభవ మతబోధకులవలనను సారాయమనునది గొప్ప విషమనియు, అదిశీఘ్రముగా దేహమందు వ్యాపించి దేహపటుత్వమును, తెలివిని, మంచినడవడిని నశింపజేయుననియు బహుగానొక్కి చెప్పబడియున్నది. కాబట్టి యిట్టి పిశాచిని ప్రతివారును ముఖ్యముగా యీసారాయము వల్ల బహుఘోరముగానశించుచున్న ఉష్ణప్రదేశములవారందరును పోరాడిజయించి అపాయకాలములో వాడబడకుండా క్రమమైన వాడుకనిమిత్తము భద్రముగాదాచియుంచిన భయంకర విషయౌషధములవలె నీసారాయము మొదలగు మత్తువస్తువులనుకూడా భద్రపరచి క్రమముగా వాడునట్లు ప్రయత్నించవలెను.”

(చేవ్రాలు) టి. సదాశివ అయ్యర్.

# విషయసూచిక.

—

# పీఠిక.

మత్తుపదార్థముల వ్యాపారమెక్కడనున్నను అది వినాశకరమైనది. "మొదట మనుష్యుడు కొంచెము సారాయిత్రాగును, అదివానినిమరి కొంతత్రాగించి చివరకువానినే మ్రింగివేయును" అను సామెత జపానీయులలో గలదు. త్రాగుడు పిశాచమెక్కడెక్కడ వ్యాపించునో యచ్చటనెల్ల నీ విధముగా జరుగుచుండును.

మానవకోటికి గల శత్రువులలో త్రాగుడు పిశాచము ముఖ్యమైనది. దానికి మంచివారు చెడ్డవారు, బలవంతులు దుర్బలులు, గొప్పవారు కొద్దివారు అనుభేదములేదు. అందరినొక్కరీతిగానే తనకు దాసులుగా జేసికొనును. ఎంతబలహీనమైన మధుసారము త్రాగినను అది క్రమముగ మనుష్యుని మనస్సును, శరీరమును చెడగొట్టి వాడు పొందదగిన యున్నతదశకు రానీయకుండ జేయును. అది చేయగల మహాపకారమేమన తల్లిదండ్రుల పాపకృత్యములు వారిబిడ్డలను బాధింపజేయును; త్రాగుడుకలవాటుపడినవారి బిడ్డలు మనస్సునందును దేహమందును దుర్బలులుగా నుందురు. బాల్యమున నసహాయులై యున్నపుడు తిండికిని,బట్టకును, విద్యకును, ప్రేమకును ముఖము వాయుదురు. త్రాగుడు పిశాచము చిన్నవారి నాకర్షించి వారిని పాపకూపములలో పడద్రోసి వారిని శాశ్వతముగా పాడుచేసి వారితలిదండ్రులను దుఃఖసముద్రములో ముంచును. అది న్యాయస్థానముల ద్రోహపుతగాదాలతోడను, కారాగృహములను ఖైదీలతోడను, పిచ్చివారియాశ్రమముల పిచ్చివారితోడను నింపుచున్నది. ఈ పిశాచము యొక్క దురంతముల జెర్కొనుట సాధ్యముకాదు. ఇట్టిపిశాచముల నెవ్వరైన కోరుదురా ?

ఇది ప్రజలు అలవాటులన్నిటిలోను మితముగానుండుట వలని లాభములను, మితముతప్పుటవలని చెడుగులను స్పష్టముగా దెలియజేయునట్టి యమూల్యమైన పుస్తకము. ఇదిప్రజలలోని నీతి ఆరోగ్య



ములను చెడగొట్టు పాడు అలవాటులను పారద్రోల కంకణముకట్టుకొన్నవారి మహాయుధము. లోకమందుగల గొప్పవైద్యశాస్త్రజ్ఞుల యొక్కయు, రాజ్యాంగ తంత్రనిపుణుల యొక్కయు సంఘసంస్కర్తల యొక్కయు, మతకర్తల యొక్కయు సదభిప్రాయములీ పుస్తకమున నిమిడియుండుటచే దీనిని చదువువారికిది చాలయుపయోగకరముగా నుండును. ఈపుస్తకము మద్యసారముల నుపయోగమునుగూర్చియేగాక, విడువలేని యలవాటులను బుట్టించుపొగాకు, తేయాకు, కాఫీ మొదలగువాని యుపయోగములను గూర్చియు చర్చించును. ఇట్టి ఆరోగ్యశత్రువులను నిర్మూలము జేయ మనదేశనాయకులు కొంద ఱొకవైపు శ్రమపడుచున్నను, అట్టి యలవాటులవలన గలుగు కీడులను గూర్చి మనదేశ జనులనేకులకింకను దెలియకున్నది. ఇట్టి ముఖ్యవిషయముల దెలియనావశ్యకమగు జ్ఞానము నీ పుస్తకము వలన నందఱికి గలుగునని మానిందు నమ్మకమైయున్నది.

ప్ర కా శ కు లు.



యుద్ధము.

వ్యాధి.

సారాయి.

1,00,00,000

1,50,00,000

2,00,00,000

మరణ మేమని చెప్పుచున్నదనగా :—

"యుద్ధమువలనను వ్యాధివలనను నశించిన జనముకంటే భయంకరమైన సారాయి వలన నెక్కువ జనము నశించిపోవుచున్నారు."

(గమనింపు. పై సంఖ్యలు గతయిరోపా పెద్దయుద్ధ కాలములోలెక్కింపబడినవి.)



(1) (2) (3)

త్రాగునియొక్క ఆరంభస్థితియును అంత్యస్థితియు నిందుచూపబడియున్నది.

# 1. అధ్యాయము.

## మధుసారము అనగా సారాయము.

ప్రస్తుతమందు నాగరికతతో మిళితమైన పద్ధతులను, అలవాటులను యేర్పఱచుకొనుటయందు మనహిందూదేశస్థులు పొందులాభ నష్టము లెట్లున్నను, పశ్చిమదేశములయం దలుము కొనుచున్న కొన్ని దురాచారములు మనదేశమందును గలవని దేశాభిమానులగు ప్రతివారొప్పుకొనుటయేగాక, యట్టివాని నీదేశమందు లేకుండ దఱుమ ప్రయత్నింపవలెను. అట్టిదురలవాటులలో నొకటి త్రాగుడు. ఏదేశములలో నీత్రాగుడుపిశాచము వ్యాపించునో యాదేశము పాపమున కాటపట్టైయుండును. తూర్పు దేశములకు పడమటి దేశములతో సంబంధము లేనప్పుడు, తూర్పుదేశములలో సారాయి యననేమియో తెలియదని మనము ధృఢముగా జెప్పలేముగాని, యప్పటిలో నీయలవాటు హిందూదేశమందు యెక్కువవృద్ధిలో లేదనుటనిశ్చయము. ఇటీవలకొన్ని సంవత్సరములలో మత్తుపదార్థములకగు వ్యయము




మరణపు ద్వారములు సారాయము త్రాగువారి సమూహములతో నింపబడియుండును.

బహు త్వరితముగా వృద్ధిజెంది, యనేకవేల స్వదేశస్థులకుటుంబములకు చెప్పనలవిగాని నష్టమునుకలిగించెను. బుద్ధిమాంద్యతయున్ను, దుర్బలత్వమున్ను సారాయిద్రవ్యముల వ్యాపారమును వెంటనంటియుండును. ఇట్టిది సీమసారాయిలను త్రాగు ధనవంతులయందు మాత్రమే యుండునని గాదు; ఇది బీదవారియందున్ను గొప్ప నాశనకరమైనదిగాను, నీతిని జెరచునొక దురలవాటుగా మెల్ల మెల్లగా వృద్ధియగుచున్నది. మహా హానికరములగు దేశీయసారాయములు చవుకయగుటచే బీదలకును, నిఱుపేదలకును అందుబాటులోనుంటున్నవి. ఈ పిశాచముయొక్క వినాశకరమైన చెడ్డపనులు దేశక్షేమమును గోరు ఏభారతీయుడైనను సహించగలడా? ఈ పిశాచమును దేశమునుంచి పారద్రోలుట ప్రతిభారతీయునకును విధిగాదా?

ఈ యధ్యాయమందలి కొన్ని విషయములును, రుజువులును, అట్టి అభ్యాసమునుండి దూరముగానుండుడని చదువరులను ప్రోత్సాహపర్చుటయేగాక, అట్టివారనేకులు వివేకముకలిగిన స్వదేశాభిమానులై బర్మా, సింహళ, హిందూదేశములందున్న యీవ్యాపారమునంతమునొందింప సమకట్టవలయునని కూడా చెప్పుచున్నవి.

పశ్చిమదేశములలో సారాయి వ్యాపారమెక్కువగా నుండుట యేవానికి చాలబాధకరముగానుంటున్నది. అందుచే నాతురతగల కొందరు పురుషులును, స్త్రీలును గలసి సారాయి త్రాగుడు మాన్పుట తమవిధియని యెంచి అదినిర్మూలమగు వరకెట్టికష్టములనైన బడుటకు నిశ్చయించుకొని అవి దేశమున అమ్మబడకుండునంత వరకు నిద్రింపజాలమనిరి. అందుచే ముప్పది యాఱు లక్షల చదురపుమైళ్ల వైశాల్యమున్ను, నూరుకోట్ల జనులునుగల యునైటెడ్ స్టేట్స్ అను అమెరికాయందలి నొకదేశపు హద్దులలోపల నెచ్చటను మధుసారమమ్మబడ కూడదని యాదేశాధికారు లాజ్ఞలిచ్చిరి. నాగరికములైన కొన్నియితర దేశములు మధుసారపు వ్యాపారమే మానివేసిరి. మరికొందఱు లోకాభిమానులు మధుసారపువ్యాపారమును బొత్తుగా మాన్పివేయవలయునని గొప్పప్రయత్నములు చేయుచున్నారు. మన

మును యిట్టి పిశాచమును మనయిండ్లనుండియేగాక మనమతిప్రేమగా జూచు నీ హిందూదేశమునుండియు తొలగింప నిశ్చయించుకొనున్నట్టి ప్రతివారి హృదయమును పురికొల్పునుద్దేశ్యముతో నీక్రింది విషయము లుదహరింప బడినవి. ఇదివరకు ఇంగ్లాండులో ప్రధానమంత్రిగానుండిన విలియమ్. ఎవార్ట్. గ్లాడ్‌స్టన్ అనువారు, 1880 సంవత్సరమందు జరిగిన ప్రజల సభయందు "యుద్ధము, అంటురోగములు, కరువు, అను యీమూడింటికంటె త్రాగుడు ప్రజలకెక్కువవిపత్తు కలుగజేసెన" ని చెప్పిరి.

## మితానుభవమననేమి.

"మితమను మాటను సమాన్యముగా ఎక్కువగాకుండ అని యర్థము. అట్టి యర్థముతో త్రాగుడుకొంచెముండ వచ్చునని యనుకొనినయెడల, మొదటకొద్దితో యారంభించ బడిన యీయలవాటు తుదకమితమై మోసము జేయును. కాబట్టి మితానుభవమనగా త్రాగుడు బొత్తిగా లేకుండుటయని చెప్పుటప్రసక్తము యుంటున్నద" ని సర్. బాలచంద్రకృష్ణ. కె. టి. ఎల్. ఎం. యనువారు ఆన 1905 సంవత్సరమందు హిందూదేశమంతటికొరకై కాశీలో జరిగిన మితానుభవ సభావేళములో జెప్పిరి.



త్రాగుబోతు తనస్వంతప్రాణమును గూర్చి యైనను జాగ్రత్తపడడు.

## మధుసారమన నేమి.

మధుసారము తననుగూర్చి మనకీక్రిందివిధముగా జెప్పుచున్నది. "నేను నిప్పునైయున్నాను. కాల్చగలను, మాడ్చగలను. క్షీణింపచేయుటయేగాని యెన్నడైనను వృద్ధిబొందింపను. నేనే రోగమునైయున్నాను. నావలనవచ్చు జ్వరమతివేడిగానుండును. నేనే కాష్ఠమునై యున్నాను. నేను రాజవస్త్రములను, గురువుల నిలువుటంగీలను, రాణులపట్టువస్త్రములను ఎన్నడైనను తృప్తిలేనట్టి నాకడుపున బెట్టుకొందును. నావలనగలుగు మత్తు ప్రకాశమానమై కొద్ది కొద్దిగాతగ్గుచు, తుదకేమియులేకుండా పోయి కొంచెము నెమ్మదిగలుగజేయును. పిమ్మటనాలోపుట్టుమంటలు మెల్లమెల్లగా హెచ్చిచుట్టునున్నదానిని నాశనము జేయుచు తుదకేమియు మిగులకుండు వఱకు కాల్చివేయుచుందును. నేను మంటలతోనిండిన సరస్సునైయున్నాను. సాహద్దులలోనడచు యేనాలుకయు తనదాహమును తీర్చుకొనలేదు. నన్నునీరు ఎంతమాత్రమును ఆర్పలేదు.

క్లింటన్ - బాంక్రాఫ్ట్.

---

## మధుసారము మెదడునందు చేయుపని.

"మెదడునందలి ముఖ్యావయవములు ఈక్రింది విధముగా వృద్ధిపొందును :—గుండెముఖ్యభాగములు, ఊపిరితిత్తి ముఖ్యభాగములు, కండరముల ముఖ్యభాగములు, జ్ఞానముఖ్యభాగములు, ఇంద్రియ నిగ్రహముఖ్యభాగములు.

మధుసారము ఈ పైముఖ్యభాగముల నంటుకొని అవిచేయుపనికి వ్యతిరేకమైన పనిచేయుచు మనుష్యుడు తన్నుతాను స్వాధీన పరచుకొనుశక్తితగ్గించును. ఇట్లు ప్రాణమునందలి మిగుల విలువగల భాగములేముందుగా మధుసారముయొక్క నాశనపు పనిని రుచిచూచునవి. దేహమునందెంత కష్టము కలిగినదో కనుగొనవలెనన ఎంతసారాయముత్రాగితిమో కనుగొనిన చాలును. ఇదిజ్ఞానమునకు స్థానమైన



ముఖ్యావయవములను చెరుపుటచేత వాని యింద్రియములు సరిగా పనిచేయలేవు. అందుచేత కాలముయొక్కయు, స్థలముయొక్కయు, కొలతల యొక్కయు జ్ఞానము స్పష్టముగానుండదు. ఇవన్నియు వానిమనస్సులో అల్లకల్లోలముగానుండును. రైలుమార్గ అధికారులును ఇతర అధికారులును వారిపనివారు బొత్తుగా త్రాగకుండునటుల ప్రోత్సాహపరచుచున్నారు. పైనరములలోని మూడవ సముదాయమును దుర్బలము చేయుటచేత కండరముల కదలిక నిశ్చలమైనదిగా నుండదు. మనుష్యులు ఇట్టి మత్తుతోనుండి వీధులలో తిరుగులాడునప్పుడును మరలలో పనిచేయునప్పుడును అపాయములు సంభవించును. చివరగా గుండె, ఊపిరితిత్తులను నడుపుమూలాధారములను కదలించును. ఇట్టి అమిత ఉపయోగమునకు మరణమేతగిన ఫలమైయుండుననుటకు సందియములేదు.

ఇతరావయవములన్నటికంటె మెదడునందు మద్యము చేయుపని ఎక్కువనాశనకరమై యున్నది. మద్యసారమునకు దాసుడగు నొక దురదృష్టవంతుడు తాను రానురాను ఆడుమాటలకును చేయుపనులకునుజవాబుదారియైయుండకపోవుటచే ఇతరులచే వాడుపిచ్చివాడుగా నెంచబడును గనుక తన్నుతానుగాని యితరులనుగాని హానిపరచకుండ అతడు కాపాడబడవలెను.

## మద్యసారము రక్తపారుదలయందుచేయుపని.

రక్తమందలి జీవకణములు ప్రాణవాయువును సన్నని యల్లిక నరములకు కొనిపోవును. ఎక్కువమంచి యారోగ్యము ఎఱ్ఱజీవకణములను వానిసంచారమును బట్టియే యుండును. మద్యము యెఱ్ఱజీవకణముల బలము తగ్గించుటచే వానిసంచలనము మందగించును. నగర రక్షకునివలె పనిచేయు తెల్లజీవకణములు దేహమందంకురించునట్టిగాని, లేక వెలుపలినుండి చొరబడునట్టిగాని రోగాంకురములను నిర్మూలముచేయును. అయితే మద్యసారము రోగాంకురములను జంపు తెల్లకణములు. రోగాంకురములను సమీపింపనశక్తులను జేయుటచే,

రోగాంకురములు నిరాటంకముగా రక్తమందు ప్రవేశించి దేహమంతయువ్యాపించి, బలహీనములగు అవయవములను లోపరచుకొనును.

అంకురముల సిద్ధాంతమందు నిపుణుడగు ప్రొపెస్సర్ మెచ్నికాఫ్ యనునాయన మధుసారము . దేహమందలి నరములకు, యితర ముఖ్యావయవములకు అనారోగ్యమగుటయేగాక అంటురోగములను దెచ్చు అంకురముల నెదిరించి దేహసంరక్షణజేయు తెల్లజీవకణములకు మిగుల హాని కల్గించునని చెప్పెను.

## నరములు—మధుసారమును.

మెదడు, వెన్నుపూస, నరములబోలు, సారనరములు యివన్నియునరములలోని భాగములే. సారాయము వలన నరములు రేపబడి కోపగుణమును గలుగజేయును. ఇట్లు అదికోపమైనను లేదా మత్తైనను కల్గించునదైయున్నది. ఇదితగ్గుటతోడనే దేహమునకు బలహీనమున్ను, మనస్సునకు విచారమున్ను కల్గును. మధుసారము కొంచెముమత్తు కల్గించుటయేగాక బొత్తుగా స్మృతితప్పజేసి పక్షవాతము, నరములలో తిమ్మురుల్లుకూడా కొంతవరకు కల్గించును.



బుద్ధిహీనుడును, అతడు సారాయి త్రాగు పాత్రయును.

## మధుసారము వంశపరంపరగా జేయుపని.

వంశ పారంపర్యమనగా తలిదండ్రులకుండు కొన్ని గుణములు పిల్లలు కల్గియుండుట. గర్భధారణకాలమందుతలిదండ్రుల దేహస్థితి, బుద్ధికుశలత యెట్టిస్థితియందుండునో పుట్టబోవుబిడ్డలలోకూడా నట్లెయుండును. ఇట్టిసిద్ధాంతమును బట్టి స్త్రీపురుషులు తమకెట్టిబిడ్డలుకల్గుదురో నిశ్చయించుకొనవచ్చును.





పడుచువారు త్రాగుడుపల్ల సంతోషమే కోరుదురుగాని హానినిగూర్చి విచారింపరు.

“ మత్తుపదార్థముల నుపయోగించు తలిదండ్రులకు కలుగు పిల్లలు బలహీనులును, వివేకశూన్యులును, కించిదాయుస్సును గలిగి, సహజముగా దుష్ప్రవర్తన గలిగినవారై యుందురనుటకనేక దృష్టాంతములు గలవు”. అని కేంబ్రిడ్జి రోగనిదాన కళాశాల శాస్త్రజ్ఞుడగు జి. సిమ్స్ వుడ్-హెడ్. ఎం. ఎ., ఎం. డి. గారు చెప్పిరి.



ఒకఁడు బాగుగాత్రాగి నశించిపోవుటయందు పిశాచి బహుసంతోషించును.

వెఱ్ఱితనము, కాకి సోమాలయను నొక విధమగు మూర్ఛరోగ మును మధుసారమెక్కువగా నుపయోగించువారి బిడ్డలకుండు రోగములే. త్రాగుబోతుల బిడ్డలు సాధారణముగా పసితనమందే మరణించెదరు.

## మధుసారము—రోగములు.

ఏబదిసంవత్సరముల క్రిందట మధుసారము బలమును, రోగములను శాంతిపరచు నొక యౌషధమని వైద్యులు నమ్మియుండిరిగాని యిటీవల రోగమును ప్రబలజేయు అంకురములను నిర్మూలము చేయుటకుగాని, వానిశక్తి నాపుటకుగాని మధుసారమెంతమాత్రముపయోగింపరాదనియు, దానినుపయోగించు వైద్యశాలలలోకంటె ఉపయోగింపని వైద్యశాలలలో మరణములు బహుకొద్దియనియు సరిపోల్చి కనుగొనిరి.

బుద్ధిమంతులగు కొందరు, ఆరోగ్యము చెఱిపి, బలమును తగ్గించు నొక వస్తువు దేహమునకు బలము కలుగ జేయుననిగాని, బలముగల దేహులకెక్కువ బలము నిచ్చుననిగాని నమ్మజాలకుండిరి.

మధుసారము, రోగముల నెదిరించుశక్తిని మన దేహమునుండి తగ్గించుటయేగాక రోగము వచ్చిన తరువాత దానిని సులభముగా తగ్గించుకొను శక్తిని గూడ బలహీనపరచును.

"ఇతర పదార్థములన్నిటికంటె మధుసారము లెక్కలేని నేరములను, పిచ్చితనమును, బాధను, దుఃఖమును కలుగజేయును."

"త్రాగుడు, నేరము, పిచ్చితనము యివిమూడున్ను స్నేహితులని" డాక్టర్ ఫోర్బ్సు విన్‌స్లో, ఎమ్. బి; యల్. యల్. డి; సి. యల్. బి. గారు వ్రాసిరి.

## మధుసారము—కామపుజీవితము.

మధుసారము దేహమునుద్రేకింపజేయుటచే మనుష్యుని కామమును వృద్ధిచేసి పాపము జేయునట్లు ప్రోత్సాహించుచున్నది. మధు

సారము మనుష్యుడు తన్నుతాను స్వాధీన పరచుకొను శక్తిని తగ్గించునందున యీకామమ నెదిరించు శక్తిలేని వానిగా జేయుచున్నది.

ఫ్రాన్సు దేశమందలి ఘనులగు వైద్యులు కొందరు, ఆదేశమందు తక్కువసంఖ్య పుట్టుకలుండుటకు మధుసారోపయోగమే ముఖ్యకారణముగా నెంచిరి. ఏలననగా ప్రాణోత్పత్తి కవసరమగుకొన్ని యంకురములకుండు బలమును తగ్గించుటచే గర్భము గొడ్డు బోవునటుల జేయును.

"త్రాగుడు లేనట్టియు, యింద్రియ నిగ్రహము గల్గినట్టియు మనుష్యుడెక్కువ యుపయోగకారిగా నుండునని లార్డ్. ఫ్రెంచ్ దొరగారు చెప్పిరి.

## మనుష్యునిసహజగుణము—మద్యపానము.

"సహజగుణమన మననిజస్థితిని దెల్పును; కీర్తియన యితరులు మనలగూర్చి అనుకొనునది దెల్పును."

దేవుని తెలిసికొనుటే హృదయమునకు ముఖ్యమైనపని. దానికంటె నెక్కుడుజ్ఞానములేదు. ప్రార్థనయనగా మనుష్యుడు తనజ్ఞానమునుపయోగించు గొప్పసాధకమని గ్లాడ్ స్టన్ దొరగారు చెప్పియుండిరి. మధుసారము మనుష్యుని సూక్ష్మబుద్ధిని మందగింపజేసి తుదకు వాని జ్ఞానమును పాడుజేయును.

"మధుసారద్రవము లెంత తక్కువగా బుచ్చుకొనినను, బుద్ధిని, న్యాయాన్యాయ వివక్షతను, మనస్సాక్షిని, యింద్రియనిగ్రహమును నడుపు మెదడు యందలి సూక్ష్మనాడులను బలహీనపరచును.

ఇట్లుజ్ఞాన స్థానము లెప్పుడు బలహీనమైనవో అప్పుడే, దయ, సత్యము, ధైర్యము, ప్రేమ మొదలుగాగల సహజగుణములన్నియు బలహీనమైపోవును."



# మధుసారమువలన మనస్సునందు కలుగు మార్పులు.

5-వ. నార్మన్. కెర్ జ్ఞాపకార్థముగా 1913 - సంll నవంబరు 8-వ తేదిని ఎడింబరో పట్టణమందు శాస్త్రప్రవీణుడగు సర్. థామస్ క్లౌస్టన్, ఎం. డి., ఎల్. ఎల్. డి. గారుపన్యాసమిచ్చిరి, అవి "బ్రిటిష్ జర్నల్ ఆఫ్ ఇనేబ్రైటి" యను పుస్తకమునందు ముద్రణమైయున్నవి. వానిలో కొన్ని భాగములు మాత్రమిచ్చట నుదహరించుటను కుతూహలపడుచున్నాము.

"మధుసారము వలన గలుగు ఫలితములకు అధ్యాత్మవిద్య (అనగా మనస్సును పరిశోధించు విద్య) నుపయోగించి చూచినయెడల, అది మొదటిసారి అవయవములకు తృప్తినధికముగా నిచ్చును.

"జ్ఞాపకశక్తి, మధుసారము మనుష్యుని జ్ఞాపకశక్తికేవిధ సహాయము చేయకపోవుటయేగాక ఫలానికాలములో ఫలాని విషయము జరిగినదను జ్ఞాపకమును పాడుచేయ జూచును.

"శ్రద్ధ. మధుసారము మనోనిశ్చలతతగ్గించును. అందుచే నేపని మీదగాని త్రాగువాని బుద్ధి నిలుకడగానుండదు. త్రాగుడుశ్రద్ధను తగ్గించును.

"మనోశక్తి." మనోశక్తికిని, బుద్ధిబలములకును గలసంబంధమునుబట్టియైనను, లేదా, బుద్ధిమాలినట్టియు, హానికరములగు పనులను జేయుటకు నిరుత్సాహము గలిగించు శక్తినిబట్టియైనను మధుసారఫలితమును పరీక్షించిన యెడల నది యట్టి మనోశక్తిని తగ్గించునని నూటికి తొంబదితొమ్మిది విషయములలో దృష్టాంతపరుపవచ్చును.

"మాట" మత్తుగలిగిన యొకడు మాటలాడుట చూచిన నవియు ద్రేకము గలిగినవై పదింట తొమ్మిదిపాళ్లు పిచ్చిమాటలై యుండును.





"స్వభావము, కోరికలు. త్రాగుబోతులు సాధారణముగా మత్తు గల్గియున్నప్పుడు ప్రాణహానికైన వెనుక దీయక ఎట్టి దుష్కృతమునైనను జేయుదురు. ఇంగ్లాండు దేశములో జరుగు ఆత్మహత్యలలో నూరింటనలువది మద్యసారము వలన సంభవించినవైయున్నవి."

మద్యసారమువలన గలుగు ముఖ్య కీడులు. మద్యసారము యెండాకాలములో నెండదెబ్బ కెక్కువ సహాయము చేయును.

మద్యసారము పలువిధ దుస్స్వప్నములు కలిగించును.

మద్యసారము అకాలవృద్ధాప్యము దెచ్చును.

మద్యసారము జీర్ణశక్తిని తగ్గించును.

మద్యసారము కార్జము, (లివర్) గురదాలకు (కిడ్నీస్) (ఉపకాయలకు) నష్టముజేయును. కార్జముపైని ముళ్లు ముళ్లుగా లేచు "నైప్రైటీస్" లేక "బ్రైట్స్" అనురోగమును బుట్టించును.

మద్యసారము గుండె నిబ్బరములేక దడగలుగ జేయును.

మద్యసారము రక్తనాడులను గట్టి పరచుటచే "ఆర్టరియోస్క్లెరోసిస్" అను వ్యాధిని దెచ్చును.

మద్యసారము కించిదాయుస్సుకు కారణము.

మద్యసార మత్యల్పకాలముల్లాసము నిచ్చినను అత్యల్పకాలములోన అట్టియుల్లాసము తగ్గిపోయి వానిని దుఃఖములో ముంచును.

మద్యసారము వలన చేతిపనులు చేయువారి జ్ఞాపకశక్తితగ్గును.

అదిక్షయరోగమును బుట్టించును.

మద్యసారము ఉన్మాదము గలుగజేయును.

మద్యసారము వాడుకచేయువారి దేహములు వాతరోగమునకు, అతిమూత్రరోగమునకు ఊపిరితిత్తుల వాపుగలుగు రోగములకును లోనగును. అపాయములును, శస్త్రవిద్యచేయించుకొను నవసరములును, గొప్పవ్యాధులును మధుసారము పుచ్చుకొనువారికి వచ్చిన యెడల వారుబ్రతుకుట బహు అరుదు.

ఊపిరితిత్తులవాపు (Pneumonia) రోగముగలవారు, కఫవాత రోగులును మేలుగలుగునని మద్యసారమునుపయోగించిన యెడల మేలుకు బదులుగా కీడేఎక్కువగా చేయును.

ఆస్తిపాడగుట, అపాయములు గలుగుట, నిప్పు ఉపద్రవము మున్నగు ప్రాణాపాయములకు మద్యసారమే ముఖ్యకారణమైయున్నది.

పూర్వమునుండి నేటివరకును అనేకుల కుటుంబములు మధుసారమువలన దుర్గతిపాలైనవి. కోట్లకొలది జనులు కుటుంబములు లేనివారైరి.

## చక్రవర్తులు, దేశాధికారులు, ప్రధానమంత్రులు, నాయకులు రాజ్యాంగతంత్రనిపుణులు, వైద్యులు మున్నగువారిచ్చిన సాక్ష్యములు.

1. జర్మనీదేశపు పూర్వపు చక్రవర్తి రెండవ విలియం ఓడలసేనానియగు తనచిన్న కుమారునికి 1911-సం॥లో నిట్లువ్రాసెను :— "రాబోవు గొప్పయుద్ధమునందు ఆరోగ్యమగు నీశరీరపుష్టి యవసరమైయున్నది. నరములపుష్టియే జయమును దెచ్చును. అత్యల్పముగా మధుసారమునుపయోగించు జనాంగమే జయశాలులగుదురు. స్వలాభమును జూచుకొను వాడవుగాక యోగ్యత గలిగి దేశాభిమానమునే గలిగి యుండగోరెదను."

2. ఇదివరలో అమెరికాయందలి యునైటెడ్ స్టేట్సునకధిపతిగానున్న థియోడర్ రూజ్‌వెల్ట్‌గారు "అనేకులను నేరస్థులనుగా జేయునది మద్యసారమే, సారాయి అంగళ్లు పెట్టువారే శాసనముల్లంఘించువారు. సారాయి అమ్మువారిని విచ్చలవిడిగా విడిచినయెడల, వారు సంఘమునుమాత్రమేగాక రాజ్యాంగమునుకూడ దుస్థితిలోనికి దీసికొని వత్తురు" అని చెప్పిరి.



3. గౌరవార్హులగు లాయడ్ జార్జిగారు గత ఐరోపా మహాయుద్ధ కాలములో "మేము జర్మనితోను ఆస్ట్రియాతోను త్రాగుడుతోను పోరాడుచుంటిమి. ఈముగ్గురిలో త్రాగుడే గొప్పశత్రువైయున్నది. సముద్రములో మునిగివచ్చు జర్మనీ యోడలకంటె త్రాగుడు యీయుద్ధమునందెక్కువనష్టము కలిగించుచున్నద" ని చెప్పిరి.

4. మైకములేని సైన్యమేజయమునొందును, శత్రువునకంటె ద్రాక్షరసమునకెక్కువ భయపడవలయును." అని నెపోలియన్ బోనపార్టు చెప్పెను.



(1) సారాయము నమ్మువాడు నీ సొమ్మును, ప్రాణమునుకూడా అడుగుచున్నాడు.

(2) కాని దొంగ నీ సొమ్మును మాత్రమే అడుగుచున్నాడు.

5. "మధుసారము న్యాయాన్యాయ వివక్షతలేకుండ జేయును. త్వరగా ఆయాసము గలుగజేయును. వ్యాధిగల్గినపుడు తాళలేకుండ జేయును" ఫీల్డ్. మార్షల్. లార్డ్. రాబర్ట్స్. వి. సి., కె. జి., కె. పి. ఫీల్డ్ మార్షల్. లార్డు వోల్సెలీ. కె. పి., జి. సి. పి.

6. గత ఐరోపాయుద్ధ కాలములో జర్మనీదేశపు కౌంట్. వాస్. మాల్టె కె. గారిట్లుచెప్పిరి :— "ఫ్రాన్సుదేశపు సైన్యములు చేయు నాశనమునకంటె బీరు సారాయి జర్మనీవారి కెక్కువనాశనము కలిగించుచున్నది."

7. యునైటెడ్ స్టేట్స్ ఓడల సైనికులు మద్యసారము మానవలయునని ఆజ్ఞనిచ్చునప్పుడు సెక్రటరి డానియల్స్‌గారు "ప్రస్తుతయుద్ధనావలమీద విద్యుచ్ఛక్తి ఆవిరి యంత్రములుండుటచేత వాటిని స్వాధీనమందుంచుకొనువారు యెట్టిమత్తు పదార్థములకైన పాలుబడకుండుట ముఖ్యమైన విషయమ"ని చెప్పిరి.

8. ఘనత వహించిన చక్రవర్తిగారి ముఖ్యవైద్యులగు సర్. ఫ్రెడరిక్ ట్రీర్లు, బార్జ్ జి. సి, వి. సి, ఎల్. ఎల్. డి., యన్. ఆర్. సి యస్. సర్జంటుగారిట్లనిరి :— "మద్యసారము వలన గలుగు ఫలితము కొంచెముల్లాసము గలిగినను, అట్టియుల్లాసమల్ప కాలముండి, అదిపోగానే మనుష్యుని బలహీనునిగా జేయును. ఎట్లనగా మధుసారము దేహమంతటిలోనున్న బలమున కొక్కసారియే పనికల్పించి, ఆబలము పోగానే అల్పకార్యమైనను చేయశక్తిలేనివారినిగా జేయుచున్నది" అనిచెప్పిరి.

9. "మధుసారము మొదట కొంచెము చురుకుగలదైయుండినను దాని సత్తువతగ్గుముఖము అతిరక్తములోనికి గ్రహించబడినపుడు రక్తము త్వరగా ప్రవహించునట్లుజేసి నరసముదాయము యొక్కయుద్రేకమును తగ్గించును గాన నరములు మునుపటిరీతిగా ఉత్సాహములేనివై యుండును. ఇట్లు దేహబలమును, బుద్ధిని మొద్దుపరచి, దానియధికారము క్రిందనుండు వానిని తనదేహమునకుగాని మనస్సునకు



గాని యెట్టిస్థితి గలిగినదో గ్రహింపలేకుండజేయును" అని సర్. లాడర్. బ్రంటన్. ఎం. డి., ఎఫ్. ఆర్. యస్ గారుచెప్పిరి.

10. "అజీర్ణమువలన పొత్తికడుపులో పుట్టెడునొప్పికి మధుసారమే ముఖ్యమైన ఔషధమని తలంచుట బహుగొప్ప పొరబాటు. జఠరసంబంధమగు నరములనదిస్మృతి తప్ప జేయుటచే నొప్పి తగ్గినట్లుండునేగాని అదినిజముగా నొప్పినితీసివేయజాలదు, తీసివేయుటకు బదులుగా హెచ్చించును" సర్. విక్టర్ హార్స్లె.

11. "మధుసారమెంత మితముగానుపయోగించినను మనుష్యుని అల్పాయుస్సుగలవానిగా జేయుననుట నిస్సందేహమ"ని. సర్. ఆల్‌ఫ్రెడ్. పియర్స్. కె. సి., వి. సి., ఎం. ఎస్. గారు చెప్పిరి.

12. "క్షయరోగమునకు మధుసారము కొంచెముపశాంతి కలుగజేయునని పూర్వము తలపబడినను యిటీవల, అదిశాంతినిచ్చుటకు బదులు సహాయము చేయుననియు, అపరిమితముగా ద్రాగువారికి శ్వాసకోశములలో పుట్టెడుక్షయరోగము ఒక దీర్ఘవ్యాధిగా నేర్పడుటనిస్సందేహమ"ని సర్ విలియం. ఆస్లర్. ఎం. డి. గారునుడివిరి.

## మధుసారము ఔషధముగా నుపయోగించుట.

పూర్వము అనేకవైద్యశాలలలో శస్త్రముచేయబడిన పిమ్మటను, అత్యవసరములైన సమయములలోను, కాయిలాలలోను బ్రాంది లేక మరొక మత్తుపదార్థమును కొద్దిగానిచ్చువాడుక కలదుగాని యిప్పుడా యలవాటొక పొరబాటని పరిశోధనలచే గ్రహించి యున్నారు. గుండెకొట్టుకొనుట ఆగునప్పుడును, ఊపిరించుట నిలిచినప్పుడునున్న వాసాగరము మంచిఔషధముగా తలపబడెను. ఒక మనిషినిస్త్రాణచే మూర్ఛిల్లినప్పుడు కొంచెము బ్రాందినిచ్చుట చాలాకాలము వరకొక యలవాటైయున్నను, యిటీవల నదికూడ నొక పొరబాటైయున్నదని కనుగొన బడెను. అట్టివ్యాధులనివారించుట కింతకంటె శ్రేష్టమైనట్టి పద్ధతులు గలవు. మూర్ఛిల్లిన మనిషిని త్వరగా తెప్పరిల్ల జేయవలెనం



ఈ త్రాగుబోతు తాను సంరక్షణ చేసి ప్రేమింపవలసిన తనభార్య బిడ్డలనుబహు నీచమైన తిట్లు తిట్టి కొట్టుచున్నాడు.

సారాయమును బహుగా త్రాగినందున మతిపోయేస్థితిలోనున్నవానిని, వానిభార్య బిడ్డలను సారాయమునమ్మువాడు తనకురా లెక్క-బాకీలు వెంటనే తీర్చవలసినదని పీడించుచున్నాడు.

డేవానిని మంచిగాలిగల చదునైన నేలమీదనైనను, గట్టిపడక మీద నైనను వెలికిలగా పరుండబెట్టి వానిమెడ, రొమ్ము, నడుము మీనినికప్పి యుండెడుబట్టలను వదులుచేయవలెను. కొంచెము నీళ్లుగాని, పాలుగాని గుటక వేయునట్లు చేసినయెడల గుండె చేయుపనికి చురుకు పుట్టించును.

ఆస్ట్రేలియాలోని డాక్టర్ హ్యూ, ఎల్, మర్రెదొరగారిట్లు చెప్పిరి. "25 సం॥ క్రిందట మధుసారము వైద్యమునందు నిరాటంకముగా నుపయోగింపబడెనుగాని యిప్పటి ఔషధ శాస్త్రమునందు దాని నొక మందుగా బహు అరుదుగా చెప్పబడియున్నది. మెల్బోరన్ వైద్యశాలలో 1891-వ సం॥ 1047 పౌనులు (రూ. 15,705) అనగా వ్యాధికుదురువరకు వైద్యశాలలోనే యుండువారికొక్కొక్కరికి 5 షిల్లింగుల (రూ. 3-12-0) చొప్పున మధుసారము కొరకై వ్యయపర్చబడెను. 1914-వ సంవత్సరములో పౌ 4-12 షి (రూ. 69) అనగా 16 మంది రోగులకొక్క పెన్ని చొప్పున ఖర్చుపెట్టబడెను. వైద్యులు దాని యుపయోగమునే బొత్తుగా వదలివేసిరి.

"ఇరువది సంవత్సరముల క్రిందటనే యార్క్ పట్టణమునందలి బెల్వ్యూ వైద్యకళాశాలలో తర్బీతు నొందుచుండగా వైద్యమునందు నిపుణులగు వారు మధుసారము ఊపిరితిత్తులవాపు, కఫవాతజ్వరము, క్షయదగ్గు మొదలగు వ్యాధులకుపయోగమగు మంచియౌషధమని నేర్పిరి. ప్రస్తుత కాలపునాగరికత గలయేవైద్య పాఠశాలయందైన నొకయుపాధ్యాయుడట్టి యూహను వెల్లడి పరచిన యెడల తనసహాధ్యాయులవలన నిశ్చయముగా నపహసింప బడున"ని డాక్టర్ డేవిడ్ పాల్సన్ ఎం. డి. గారు చెప్పిరి.

వైద్యశాస్త్రమందే యేమూలికలను గూర్చిన సంగతులను చేర్చవలయునను విషయమును చర్చించుటకై 10 సంవత్సరముల కొకసారి చేరువైద్య శాస్త్రప్రతినిధులకు అగ్రాసనాధిపతిగా నుండు హార్వి వైలీ యను డాక్టరుగారు "వైద్యశాస్త్ర వేత్తలలో ఘనులగు వారు మధు



సారము బలకారియగు నొకయౌషధము కాదనియు, యిప్పుడైనను యికనెప్పటికైన నట్టియౌషధముగానుండ జాలదనియు పరిశోధించి యేకగ్రీవముగా చెప్పిరి. అదిసాధారణమైనట్టి మత్తును గలుగజేయును. స్మృతితప్ప చేయుటయే దానియందు బలకరమైన పనియని యనుకొన వచ్చును. విస్కీ, బ్రాందియును ప్రస్తుతము వైద్యశాస్త్రమునుండి



సారాయమును త్రాగువారు సైతానుకు బానిసలై యున్నారు.

వేరుచేయబడినవి. ఇట్టి సారాయములు బొత్తుగా నిరుపయోగములున్ను నిశ్చయముగా హానికలిగించునను యీసుప్రసిద్ధమైన సిద్ధాంతమును ప్రపంచమున కంతకును వెల్లడిచేయుదమని" చెప్పినట్లు 1920-

సం॥ సెప్టెంబరునెల 18-వ తేదిన ప్రచురింపబడిన "లిటరరిడైజస్ట్" అనుపత్రిక చెప్పుచున్నది.



త్రాగుబోతు తనసొమ్మునంతటిని త్రాగుడుక్రింద కర్చు చేసినందున, అతని భార్యపిల్లలు అన్నము బట్టలు లేక అల్లాడుచున్నారు.

## శీతోష్ణదేశములలో మధుసారపు ఉపయోగము.

హార్స్లి, స్టర్జ్ గార్లవలన వ్రాయబడిన మధుసారమును మనుష్యదేహమును " అనుపుస్తకములో "మద్యసారము ప్రతిదినముప యోగించుటకొరకైనది కాకపోయినను నావికులు ఔషధముగాదాని



నుపయోగించ వచ్చుననియు అట్టిది అవసరమైన ఔషధమేయనియు యెవరైననొకరు నిరూపించినయెడల నేను దానికొప్పుకొన సిద్ధముగానున్నాను. అట్టిసంగతి నిరూపించబడువరకున్ను ధృవములకునావ ప్రయాణము చేయువారి కవసరమగు వస్తు సముదాయములలోనుండి మధుసారము నెత్తివేయుటయుత్తమమైనదని" ధృవపరిశోధకులగు డాక్టర్ నాప్‌సన్‌గారు వ్రాసిరి.

హిందూదేశమందలి యూరోపియనులు మధుసారము యిచ్చటి వేడిమికిని యిచ్చటనుండు మన్యపు జ్వరములకున్ను బహు అనుకూలమని యిదివరకు తలంచిరి. ఇదిపొరబాటైయున్నది. మధుసారము చలిదేశములలో దెచ్చువ్యాధులనే ఉష్ణదేశములందును గలుగజేయును. మన్యపుజ్వరము దెచ్చు దోమలు మధుసారము వాడుక చేయువారి నెట్లుపీడించునో ఆలాగుననే అట్టివాడుకలేని వారిని కూడా పీడించును. ఇంతే కాకుండా మధుసారము త్రాగుటవలన రోగ



...నములవని చేయుమరలలో త్రాగుబోతులకు బహుగొప్ప అపాయములుకలుగుచుండును.

మునెదిరించు శక్తిదేహము నందుండకుండుటయేగాక రోగాంతరములు దేహమునందెగ బ్రాకచేయును.

మధుసారమును గూర్చి మతగ్రంథములేమిచెప్పు చున్నవి.

హిందూదేశమందున్న క్రైస్తవ,హిందూ,మహమ్మదీయ, బౌద్ధమతములన్నియుమద్యపానము చేయుట తప్పని ఖండితముగా చెప్పుచున్నవి. క్రైస్తవవేదమగు బైబిలు ద్రాక్షారసము గాని మరే యితరమత్తుపదార్థముగాని పుచ్చుకొనకూడదని ముఖ్యముగా చెప్పుచున్నది.



రెండుమార్గములు. ఒకటి అనుమానకరమైన త్రాగుడు, రెండవది సంతోషకరమైన సంసారము, ఏది కావలయును ?

"ద్రాక్షారసము వెక్కిరింతలపాలు జేయును. మద్యము అల్లరి పుట్టించును. దానివశమైన వారందరు జ్ఞానములేనివారు" (సామెతలు 20 : 1).



"త్రాగుబోతులును, తిండిబోతులును దరిద్రులగుదురు. నిద్రమత్తు, చింపి గుడ్డలు ధరించుటకు కారణమగును" (సామెతలు 23 : 21).

"ఎవరికి శ్రమ ? ఎవరికి దుఃఖము ? ఎవరికి జగడములు ? ఎవరికి చింత ? ఎవరికి హేతువులేని గాయములు ? ఎవరికి మందదృష్టి ? ద్రాక్షారసముతో ప్రొద్దుపుచ్చువారికేగదా ! కలిపిన ద్రాక్షారసము రుచిచూడ చేరువారికేగదా ! ద్రాక్షరసము మిక్కిలి ఎఱ్ఱబడగను, గిన్నెలో తళతళలాడుచుండగను, త్రాగుటకు రుచిచూచుచుండగను దానివైపు చూడకుము. పిమ్మటనది సర్పమువలెకరచును. కట్లపాము వలె కాటువేయును" (సామెతలు 23 : 29—32).

"ద్రాక్షరసము త్రాగుట రాజులకు తగదు. లెమూయేలూ అది రాజులకు తగదు. త్రాగిన యెడల వారు కట్టడలను మరతురు. దీనులందరికి అన్యాయము చేయుదురు." (సామెతలు 31 : 4-5.)

"దేశమా ! నీరాజు గొప్పయింటి వాడైయుండుటయు నీయధిపతులు మత్తులగుటకు కాకబలము నొందుటకై అనుకూలసమయమున భోజనమునకు కూర్చుండు వారైయుండుటయు నీకు శుభము" (ప్రసంగి 10 : 17).

"మరియు యెహోవా అహరోనుతోనిట్లనెను :—మీరుప్రత్యక్షపు గుడారములోనికి వచ్చునప్పుడు మీరు చావకుండునట్లు నీవును నీకుమారులును ద్రాక్షరసమునేకాని మద్యమునేకాని త్రాగకూడదు. మీరు ప్రతిష్ఠించినదానిని లౌకికమైనదానిని, అపవిత్రమైనదానిని, పవిత్రమైనదానిని వేరుచేయుటకును"—లేవికాండము 10 : 8—10.

"తమపొరుగువారి మానము చూడవలెనని ఘోరమైన యుగ్రతను కలిపి వారికి త్రాగనిచ్చి వారిని మత్తులనుగా చేయువారికి శ్రమ" హబక్కూకు 2 : 15.

"మద్యము త్రాగుదమని వేకువనేలేచి ద్రాక్షరసము తమకు మంటపుట్టించు పర్యంతము చాలరాత్రివరకు పానము చేయువారికి శ్రమ, యెషయా 5 : 11.

"ద్రాక్షారసము త్రాగుటలో ప్రఖ్యాతి నొందినవారికిని మద్యము కలుపుటలో తెగువగలవారికిని శ్రమ," (యెషయా 5 : 22).

"మరియు మద్యముతో మత్తులైయుండకుడి, దానిలో దుర్వ్యాపారము కలదు.' (ఎఫెసీ 5 : 18)

హిందువుల పురాతన చట్టములును (మనుచట్టములను చూడుము) మహమ్మదీయుల (ఖురాన్) చట్టములును యిట్టిదానిని గూర్చియే బోధించుచున్నవి. గౌతమ బుద్ధుడు తన్ను వెంబడించువారు పరిశుద్ధమైనట్టియు నెమ్మదిగల బ్రతుకుబ్రతుకవలెనంటె త్రాగుడు బొత్తుగానంటకూడదని బోధించెను.



మరణమును త్రాగుడును బహుగొప్ప స్నేహితులై యున్నారు.



హిందూచట్ట నిర్మాణకులు త్రాగుడు మహాపాతకమనియు అదిదాదాపుగా నరహత్యతో సమానమైన పాపమనియు చెప్పినట్లు సర్ బాలచంద్రకృష్ణ, కె. టి. ఎల్. ఎం. గారు చెప్పిరి.

సంస్కృత భాషలోనున్న హిందూశాస్త్రము లిట్లుబోధించుచున్నవి :—

"మద్యం, అధేయం. అపియాన్. అగ్రజ్యాన్" అనగా మద్యము యిచ్చుటను, త్రాగుటను లేక పుచ్చుకొనుటను కూడదు.

## కలకత్తాలోనున్న సర్ లియోనార్డ్ రాజర్స్‌గారి సాక్ష్యము.

"హిందూదేశమునకు మధుసార మొక పిశాచము"ను పుస్తకములో 29-వ. పుటనుండి ఎత్తివ్రాయబడినది.

"కలకత్తాయందలి మనదేశీయులకుగల్గు కాలైముపుండయ్యే వ్యాధులలో నూరింటకెబ్బది మధుసారమువలననే గలుగుచున్నట్లు చరిత్రలు తెల్పుచున్నవి. ఈవ్యాధి ముఖ్యముగా హిందూస్త్రీలకంటె మహమ్మదీయస్త్రీలలో నెక్కువగా కనుబడుచున్నది. ఏలననగా పురుషులకంటెస్త్రీలు తక్కువ త్రాగుబోతులు. గొప్పపట్టణములలో నీవ్యాధి బహు తరుచుగాగలదుగాని యీ వ్యాధి యిదివరలో స్వదేశస్థులలోకంటె విదేశీయులగు యూరోపియనులలో నెక్కువగా కనుబడుచుండెనని ఎన్నెస్లీ అర్వింగ్‌గారు వ్రాసిరి. ప్రస్తుతము స్వదేశస్థులలో నిట్టివ్యాధి వృద్ధియగుట చూడగా వీరు మధుసారమెక్కువగా నుపయోగించుచున్నారని స్పష్టమగుచున్నది."

## మధుసారముయొక్క వాడుక.

గ్రేటుబ్రిటన్ :—"డేయిలి ఎక్స్‌ప్రెస్" అనునొక పత్రికలో లార్డ్. లివర్ హెల్మ్యామ్. అనునాయన "మనము

మద్యమునకై ప్రతిసంవత్సరము మనదేశములో పౌ. 46,00,00,000లు (రూ: 690 కోట్లు) వ్యయము చేయుచున్నామ"ని వ్రాసెను.

**అమెరికా**:—"టైటానిక్" అనుయోడ 1508 మందిని మాత్రమే సముద్రమునందు ముంచెనుగాని సారాయివ్యాపారము యునైటెడ్ స్టేట్సులో నెనిమిది దినములలో 1503 రినెత్తుకొని పోయెను. అనగా ఒక సంవత్సరములో దాదాపునలువది టైటానిక్ యోడలు మునిగిపోయినంతటి నష్టము కల్గుచున్నది."

**ఇండియా**:—స్వదేశ మద్యములను జూడగా నివి విదేశ సారాయములవలె బట్టిపెట్టి దించబడి వాడబడచున్నవి. ఇట్టివానిని వాడుటయందు బొంబాయిరాజ్యము మొదటిది, మధ్యపరగణాలు రెండవది, సింధుదేశము మూడవది, సంయుక్త పరగణాలు నాల్గవది, చెన్నరాజ్యము ఐదవది, బంగాళారాజ్యము ఆరవది, పశ్చిమోత్తర పరగణాలు యేడవది, తూర్పు బంగాళా, అస్సాము రాజ్యములు యెనిమిదవవిగా నుంటున్నవి" అని నరేంద్రనాత్ సేన్‌గారువ్రాసిరి.

## త్రాగుడుపిశాచచర్య.

ఎలి. పెర్కిన్సు అనునామె యీ విధముగా జెప్పెను:—డెన్వర్ పట్టణములో నొకసారాయి అంగడియందు కొందరందమగు యౌవ్వనులు కూడినవ్వుచు వ్రేలుచు సారాయిత్రాగుచుండగా నొక భిక్షుకుడచ్చటికి వచ్చి తలుపు నోరగాదీసి దీనదృష్టితో నాయౌవనులను జూచెను.

అంతవారాతని పిలిచి "ఓయీ! లోపలికివచ్చి నీవునుకొంచెము త్రాగిమైమరచి మావలె నుల్లాసముగానుండు మ"ని సంతోషముతో పిలచిరి.

అతడు వందనములాచరించుచు "అయ్యావచ్చెదను. మితిమీరిన యాకలిచే నాదేహమంతయు నిప్పుడుచల్లబడియున్నది." అనిచెప్పు చూలోనికివచ్చి కొంచెము సారాయిత్రాగి వారి సంతోషముతో




సకాలమందలి హెచ్చరిక.

"ఓ పడుచువాడా! నేనొకప్పుడు కావలసినంత ధనము, మంచి ఆహారము, విలు

హైనపత్రములు, చాలామంది మిత్రులతోనుంటినిగాని పాడుత్రాగుడు వలన నాకున్న యావత్తును చివరకు నాబలమును పోగొట్టుకొంటిని. నన్నుచూచి, త్రాగుడుయొక్క గొప్పకీడును తెలిసికొని జాగ్రత్తగలిగియుండుము.”

తానున్ను పాలొనియున్నట్లు నటించి వారిముఖములు కొంచెము తేరి పారజూచి వారిక్షేమముగోరిన వానివలె విచారముఖముతో నిట్టని యెను :—అయ్యలారా ! కొన్ని సంవత్సరములక్రిందట నేనెట్టిస్థితిలో నుంటినో మీరిప్పుడట్టి స్థితిలోనున్నారు. మీరును నేనును చేరి, నాబ్రతు కొక చిత్తరువేయైనయెడల నేటితో దానిని ముగించి యుంటిమి. నా యావనస్థితిలో నేనొక యధికారినైయుంటిని. ఇప్పుడు మీరు చూచు యీ నా వికార ముఖ మిదివరలో మీముఖములవలె కోమలమైయుం డెను. నేనిదివరకు మంచిగృహమున్ను స్నేహితులనున్ను గలిగి మంచిస్థితియందుంటిని. నేర్పరియైనయే చిత్రకారుడైన తనకలలో సహా జూచియుండ నంతటి సౌందర్యముగల భార్యయుగలదు. అట్టియాపె కుగల అమూల్యమైన మర్యాదయనెడి ముత్యమును నేనీమద్యమునందు గలిపిత్రాగివేసి దానిని తుదముట్టించితిని. వసంతకాలమందలి పుష్ప ములవలె మనోహరులగు నా బిడ్డలు త్రాగుబోతు తండ్రినైన నాదు శ్చేష్టలచే నాకండ్ల యెదుటనే దాటిపోయిరి. నాకొక ఇల్లుగలదు. అందు ప్రేమయనే యొకజ్యోతిని వెలిగించి దానిదగ్గర పరిచర్యచేసి చివరకు నేనాజ్యోతిని ఆర్పివేసితిని. అందుకుబదులుగా చీకటియు, దుఃఖమును నాయింట రాజ్యము జేయుచున్నవి. వేకువచుక్కనంటు నంతటి గొప్పయాశలు, తలంపులు నాకుండినను, వానినెన్నటికిని నాయొద్దకు రాకుండ జేయుటకై పెడరెక్కలు విరిచి కట్టితిని. నేడు చూచితే నేను సతిలేని పతివలెను, పిల్లలులేని తండ్రివలెను, నాదని చెప్పుటకైనను యిల్లువాకిలిలేని దేశదిమ్మరినై బ్రతుకన్న యాశలేక యుంటిని. నాకుకలిగినది యావత్తును త్రాగుడను సుడిగుండములో పడవేసితిని.”

“యౌవనులారా ! మీ మీతల్లులు, భార్యాబిడ్డలు చేయుప్రార్థనల పెడచెవినిబెట్టక, మీవలనవారికిహపరములందు గలుగు సంతోషము లలో మీరును పాలివారై యుండగోరెదరా లేక నావలెనిర్భాగ్యులై విచారమందు మునిగి యుండగోరెదరా ? ఇప్పుడే యాలోచించు కొనుడు. నామట్టుకు నాకు మీరు సన్మార్గముతోనిండి సద్గుణములు గలవారై యుండవలెననియే నాకోరిక.” అని చెప్పుచూ మెల్లగా నడచి యవతలకు బోయెను.” (Selected).



# హిందూదేశమందలి మధుసారమును మత్తుగలుగజేసెడి కొన్ని మూలికలును.

కొందరువైద్యులచే జెప్పబడినవి :—

ఈ క్రింది సంగతులన్నియు ఆంగ్లో-ఇండియన్ మితానుభవకూట మువలన నేర్పరచబడి హిందూదేశమందును గ్రేటుబ్రిటనులోనున్న గొప్పవైద్యులచే నామోదింపబడి, యీదేశములో ప్రచురింపబడి శాస్త్రీయముగాను అనుభవరీతిగాను నిరూపింపబడినవి. అవేవనగా:—

1. మధుసారమును, మత్తుమందును (cocaine) నల్లమందును మూలికసంబంధమగు (భంగు, గెంజాయి మొదలగు) మత్తుపదార్థము లును విషతుల్యములైయున్నవి.

2. ఎంతమితముగా పుచ్చుకొనినను ముఖ్యముగా హిందూదేశ మువంటి యుష్ణదేశములలో త్రాగుడు అపాయకరమైయున్నది. శరీరసం బంధమైనట్టియు, బుద్ధి సంబంధమైనట్టియు బడలికను సారాయము లెంత మాత్రమును తీసివేయశక్తిగలవికావు.

3. ఎన్నడైనను మత్తుపదార్థములను రుచిచూడకయు వానినే విధముగానైన నుపయోగింపనివారు మిక్కిలి యోపికపరులును, అంటువ్యాధినిగాని, సాధారణమగు జబ్బునుగాని నిగ్రహించుటకు సమర్థులగుచున్నారు.

4. మధుసారము, దాని నుపయోగించు వారికేగాక వారి తరు వాత వారిపిల్లలకుగూడ మేహసంబంధమగు వ్యాధులను బుట్టించును.

రేట్. పి. ఎం. ఓ., 8-వ. (లాహెూర్.) డివిషన్). వి. ఎచ్. రుదర్ ఫోర్డ్. ఎం. ఏ. ఎం. బి. (కాంటాబ్). జె. కె. ఆద్య, ఎం. బి. (కలకత్తా) ఎం. ఆర్. సి. యస్., ఎం, ఆర్, సి. పి. (అసిస్టెంట్-రెసిడెంట్, ఎం. ఓ. లండన్ టెంపరెన్సు హెూటల్), డి. వార్ లికార్. ఐ. ఎం. ఎస్. లెఫ్టనెంట్ కర్నల్. నిల్ రతాన్ - సర్కార్. ఎం. ఏ., ఎం. డి. ఎఫ్. సి. వి. (మెంబర్. బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్) చునిలాల్ బోస్, ఐ. సి. ఓ., ఎం. బి., ఎఫ్. సి. యస్., ఎఫ్ సి. వి., (ఆఫీషియేటింగ్. కెమికల్ ఎగ్జామినర్, బెంగాల్ అండ్ ప్రొఫెసర్ ఆఫ్ కెమిస్ట్రి), మెడికల్ కాలేజి, కలకత్తా) ఎస్. కె. మల్లిక్. ఎం. ఎస్., ఎం. డి. (ఎడిన్), (ప్రిన్సిపాల్ నేషనల్ మెడికల్ కాలేజి ఆఫ్ ఇండియా, సీనియర్ పి జి షి యన్, కింగ్స్ హాస్పిటల్, కలకత్తా) బి. సి. ఘోష్. ఎం. ఎ., ఎం. బి., బి. సి. (కాంటాబ్) (పిజిషియన్ & లెక్చరర్ ఆఫ్ మెడిసిన్, ఆల్బర్ట్ విక్టర్ హాస్పిటల్; యూనివర్సిటి లెక్చరర్ ఇన్ ఎక్స్పెరిమెంటల్ ఫిజియాలజి, కలకత్తా) ఎచ్. ఎన్. ఘోష్. ఎం. డి., ఎఫ్. సి. వి. (టీచర్ ఆఫ్ మెటీరియామెడిక, కాంబెల్ మెడికల్ స్కూలు, & పిజిషియన్ కాంబెల్ హాస్పిటల్ కలకత్తా) బి. సి. రాయ్, బి. ఎ., ఎం. డి. (కలకత్తా) ఎం. ఆర్. సి. పి. (లండన్) ఎఫ్. ఆర్. సి. యస్. (ఇంగ్లా) ఎఫ్. సి. వి. (ఫెల్లో ఆఫ్ ది రాయల్ సొసైటి ఆఫ్ మెడిసిన్ (లండన్) లెక్చరర్, కాంబెల్ మెడికల్ స్కూల్ & హాస్పిటల్). యు. ఎన్. బ్రహ్మచారి. ఎం. ఎ., ఎం. డి., పి ఎచ్. డి., ఎఫ్. సి. వి. ఫెల్లో ఆఫ్ ది రాయల్ సొసైటి ఆఫ్ మెడిసిన్. (లండన్) టీచర్ ఆఫ్ మెడిసిన్, కాంబెల్ మెడికల్ స్కూల్; & పిజిషియన్. కాంబెల్ హాస్పిటల్, కలకత్తా) ఢి. యన్. మైత్ర. ఏం. బి., (రెసిడెంట్ సర్జన్, మేయొ హాస్పిటల్, కలకత్తా) పి. కె. ఆచార్జి, ఎం. ఎ., ఎం. బి. (కలకత్తా) పరశరామ్ ఘర్మ, ఎల్. ఎం. ఎస్. (నేటాల్) గోల్డుమెడలిస్టు, పిరోజ్‌పురము, జేమ్సు ఎం. మెక్ఫేయిల్, ఎం. ఎ., ఎం డి., (బమ్డా) అర్నెస్ట్ జి. నీవ్, ఎం. డి., ఎఫ్. ఆర్. సి. యస్. ఇ. (మిషన్ హాస్పిటల్, కాశ్మీరము) డబ్లియు. జె. వాన్ లెన్. ఎం. డి., (ఫిజిషియన్ ఇన్ చార్జి, మిషన్ హాస్పిటల్, మిరాజ్) ఎం. ఎస్. మల్లిక్,

మధుసారము. 35

రేట్. పి. ఎం. ఓ., 8-వ. (లాహెూర్.) డివిషన్). వి. ఎచ్. రుదర్ ఫోర్డ్. ఎం. ఏ. ఎం. బి. (కాంటాబ్). జె. కె. ఆద్య, ఎం. బి. (కలకత్తా) ఎం. ఆర్. సి. యస్., ఎం, ఆర్, సి. పి. (అసిస్టెంట్-రెసిడెంట్, ఎం. ఓ. లండన్ టెంపరెన్సు హెూటల్), డి. వార్ లికార్. ఐ. ఎం. ఎస్. లెఫ్టనెంట్ కర్నల్. నిల్ రతాన్ - సర్కార్. ఎం. ఏ., ఎం. డి. ఎఫ్. సి. వి. (మెంబర్. బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్) చునిలాల్ బోస్, ఐ. సి. ఓ., ఎం. బి., ఎఫ్. సి. యస్., ఎఫ్ సి. వి., (ఆఫీషియేటింగ్. కెమికల్ ఎగ్జామినర్, బెంగాల్ అండ్ ప్రొఫెసర్ ఆఫ్ కెమిస్ట్రి), మెడికల్ కాలేజి, కలకత్తా) ఎస్. కె. మల్లిక్. ఎం. ఎస్., ఎం. డి. (ఎడిన్), (ప్రిన్సిపాల్ నేషనల్ మెడికల్ కాలేజి ఆఫ్ ఇండియా, సీనియర్ పి జి షి యన్, కింగ్స్ హాస్పిటల్, కలకత్తా) బి. సి. ఘోష్. ఎం. ఎ., ఎం. బి., బి. సి. (కాంటాబ్) (పిజిషియన్ & లెక్చరర్ ఆఫ్ మెడిసిన్, ఆల్బర్ట్ విక్టర్ హాస్పిటల్; యూనివర్సిటి లెక్చరర్ ఇన్ ఎక్స్పెరిమెంటల్ ఫిజియాలజి, కలకత్తా) ఎచ్. ఎన్. ఘోష్. ఎం. డి., ఎఫ్. సి. వి. (టీచర్ ఆఫ్ మెటీరియామెడిక, కాంబెల్ మెడికల్ స్కూలు, & పిజిషియన్ కాంబెల్ హాస్పిటల్ కలకత్తా) బి. సి. రాయ్, బి. ఎ., ఎం. డి. (కలకత్తా) ఎం. ఆర్. సి. పి. (లండన్) ఎఫ్. ఆర్. సి. యస్. (ఇంగ్లా) ఎఫ్. సి. వి. (ఫెల్లో ఆఫ్ ది రాయల్ సొసైటి ఆఫ్ మెడిసిన్ (లండన్) లెక్చరర్, కాంబెల్ మెడికల్ స్కూల్ & హాస్పిటల్). యు. ఎన్. బ్రహ్మచారి. ఎం. ఎ., ఎం. డి., పి ఎచ్. డి., ఎఫ్. సి. వి. ఫెల్లో ఆఫ్ ది రాయల్ సొసైటి ఆఫ్ మెడిసిన్. (లండన్) టీచర్ ఆఫ్ మెడిసిన్, కాంబెల్ మెడికల్ స్కూల్; & పిజిషియన్. కాంబెల్ హాస్పిటల్, కలకత్తా) ఢి. యన్. మైత్ర. ఏం. బి., (రెసిడెంట్ సర్జన్, మేయొ హాస్పిటల్, కలకత్తా) పి. కె. ఆచార్జి, ఎం. ఎ., ఎం. బి. (కలకత్తా) పరశరామ్ ఘర్మ, ఎల్. ఎం. ఎస్. (నేటాల్) గోల్డుమెడలిస్టు, పిరోజ్‌పురము, జేమ్సు ఎం. మెక్ఫేయిల్, ఎం. ఎ., ఎం డి., (బమ్డా) అర్నెస్ట్ జి. నీవ్, ఎం. డి., ఎఫ్. ఆర్. సి. యస్. ఇ. (మిషన్ హాస్పిటల్, కాశ్మీరము) డబ్లియు. జె. వాన్ లెన్. ఎం. డి., (ఫిజిషియన్ ఇన్ చార్జి, మిషన్ హాస్పిటల్, మిరాజ్) ఎం. ఎస్. మల్లిక్,

ఎఫ్. ఆర్. సి. పి. & ఎస్. (ఎడింబరో) అలహాబాదు. బి. డి. బాసు మేజర్. ఐ. ఎం. ఎస్., (రిటైర్డు) (అలహాబాదు) ఎం. సి. టాండన్. ఐ. ఎం. ఎస్. (లేట్ -వైస్ చేర్మన్, మునిసిపల్ బోర్డు, ఆలహాబాదు), మొదలైనవారు. ("స్టేట్స్మన్") ఫెబ్రవరి **22,** శుక్రవారం **1918.**

ఓ చదువరీ ! మధుసారసంబంధమగు పదార్థములు మనహిందూ దేశస్థులారోగ్యమును కూలజేసి తుదకు ప్రాణములను సహా కడతేర్చుచుండుట చూచుటలేదా ? మనముదానినుండి దూరముగానుండుటయే గాక మనహైందవ సోదరులనుగూడ యిట్టి మనుష్యజాతికి జన్మశత్రువైన త్రాగుడును రుచిచూచుటయైనను, తాగనైన నుండకుండునట్లు ప్రోత్సాహపరచుదముగాక.



పొగాకులోనున్న "నికొటిన్" అనువిషము పొగత్రాగువానికి నెమ్మదిని, విశ్రాంతిని యివ్వజాలదు.




పొగాకు మూలమున ప్రాణమండలి సత్తువయు, ఆరోగ్యమును, సంతోషమును నాశనమైపోవుచున్నవి.

# 2. అధ్యాయము.

## పొ గా కు.

“ ఓ పొగాకా ! నీకొరకై నాప్రాణముతప్ప తక్కిన వన్నియు సమర్పింతున”ని చార్లెస్‌లాంబ్, అనునాయన పొగాకునుగూర్చి ప్రీతి తోచెప్పెను.

ఇప్పుడు నిషేధించుట కలవిగాని యీపిచ్చిమొక్కయొక్క యుపయోగమునుగూర్చి తెల్లవారు పశ్చిమయిండియా వారివలన నేర్చుకొని, దానిని మనహిందూదేశస్థులకు నేర్పుటచే, యితరయేవస్తుపదార్థముల కంటెనిది యెక్కువగా నుపయోగింపబడుచున్నది. లెక్కించిచూడగాగడచిన యుద్ధమునకుముందు లోకమందంతట పైరగు పొగాకు విలువసంవత్సరమునకు 1-కి రూ. 625000000 అయినట్లు తెలిసినది.



# పొగాకు చరిత్ర.

పొగాకున్ను, అమెరికాఖండమున్ను క్రీ. వె. 1492-వ సంవత్సరమందొక్కసారే కనిపెట్టబడెను. క్యూబా ద్వీపమును కనిపెట్టుటకై కొలంబస్‌చే పంపబడిన నావికసైన్యముతాము తిరిగివచ్చి, ఆద్వీపమందలి జనులు వెలుగుచున్న దివిటీలు ధరించి యున్నారనియు, తాము తమతోకూడా తెచ్చినయొక మొక్కయొక్క సువాసన ఆద్వీపవాసులలో ప్రతివానియొద్ద కొట్టుననియు చెప్పిరి, తరువాత సుమారు 500-సం॥ గడచిన పిమ్మట స్పెయిన్ దేశపురాజు మెక్సికోయొక్క సారవంతమునుగూర్చి తెలిసికొనుటకై ఫ్రాన్‌సిస్కో ఫెర్నాండజ్ అనునతని బంపగా నాతడీవింతైన మొక్కను క్యూబాద్వీపమునుండి స్పెయిన్ దేశమునకు గొనిపోయెను.

క్రీస్తువెనుక 1560-సం॥ నందు లిజ్‌బన్ పట్టణమునకు పంపబడిన ఫ్రెంచ్ రాయబారియగు జీన్‌నికాట్ అనునాతడు పొగాకుమొక్కను స్పెయిన్‌నుండి ఫ్రాన్స్‌దేశమునకు పంపెను. (పొగాకుయనుమాట పెరిరాచే చేయబడిన వస్తుగుణదీపికలో 567 పుటయందున్న “ నికోటియానటబాకం అనుమాటనుండియె పుట్టియుండవచ్చును).

1565-సం॥ సర్ వాల్టర్‌రాలి అనునాయన యింగ్లాండు దేశస్థులకు పొగాకుయొక్క ఉపయోగమును గూర్చి హెచ్చరిక చేసెను. ఈయనగారు మొదటగా పొగత్రాగుటను అభ్యసించినపుడు దాహము గొని తననౌకరును పిలిచికొంచెము దాహమిమ్మని యడుగగా వాడు వెళ్లి బీరుబుడ్డి నొకదానిని తెచ్చి చూచునంతలో తనయజమానుని నోరుముక్కుద్వారములగుండ పొగబయలువెడలుట చూచి ఆయన కాలిపోవుచున్నాడని తలంచి ఆ బీరు నంతను ఆయనతలమీద గుమ్మరించెను.

1615-సం॥ ఇంగ్లాండు దేశమును మొదటి జేమ్సు అను రాజునేలుచుండినపుడు సర్ తామస్‌రో అను రాయబారి హిందూదేశమందలి

చక్రవర్తియగు జహాంగీరు వద్దకు పంపబడెను. ఆరాయబారియే పొగాకును మనదేశమునకు తెచ్చియుండెను. ఇంగ్లాండు దేశపు బంగాళాదుంపకూడా యీయనవలననే హిందూదేశమునకు మొదట తేబడెను. దీనినిచ్చుటకై తెచ్చినందున కీయనకునిండుకృతజ్ఞత చెల్లించవలెనుగాని అప్పటినుండి యీ పొగాకు చేయుచున్న నాశన మెంతగొప్పదియో చెప్పనలవిగాదు.

## పొగాకు అలవాటును తగ్గించుటకు చేయు ప్రయత్నము.

పూర్వము సంఘములలోను రాష్ట్రములలో నిట్టియలవాటు గలవారిని దెబ్బలుకొట్టుటగాని సంఘమునుండి వెలివేయుటగాని లేక చంపుటగాని మొదలగు దండనలచే దండించినందున అట్టియలవాటును తగ్గునట్లుల జేసిరి. ఘనతవహించిన రెండవజేమ్సు యింగ్లాండునకు రాజుగానున్నప్పుడు పొగాకు అలవాటును గూర్చి వ్యతిరేక భావమును గలిగి యుండెను. మొదటిచార్లెస్ రాజు తనకాలములో అనగా 1633-సం॥ నందు వెల్లడిచేసిన చట్టములను చూచిన యీఅలవాటు మరియెక్కువగా నిరసింపబడెనని చూడగలము. మరియురష్యా చక్రవర్తులు అనేకులముక్కులను కోసివేసిరి. నాల్గవ అమురాత్ అను తుర్కీ సుల్తాను తాను పరిపాలించు దేశములోనికి పొగాకు దిగుమతి చేయకుండ చేసి పొగాకుత్రాగినవారికే మరణశిక్షవిధించెను.

ఈ అలవాటును తగ్గించుటకే యిట్లు పనిచేయుచు వచ్చినను మిక్కిలి చలిగల ఉత్తరధృవము మొదలు అత్యుష్ణముగల సింహళద్వీపమువరకును నివసించు జనులలోను యిరోపా, ఆఫ్రికా, అమెరికా, ఇండియా, ఆస్ట్రేలియా, చీనా, జపాన్ యింకా సముద్రములోయున్న అనేకద్వీపములలో నివసించువారందరిలోను మొత్తమున 60 కోట్ల జనులు యీ అసహ్యమైన అలవాటునందు భక్తిగలిగియున్నారు.



## పొగాకునందలి ముఖ్యభాగములు.

పొగాకు నందలి తలత్రిప్పును గలిగించు నొకవిధమైన ఘాటుగల విషమున్నదనియు అది నికోటైన్ అను ద్రావకమువలె నుండునని శాస్త్రజ్ఞులు తేటపరచిరి. ఈ నికోటైన్ అనునది యొక్కటియేగాక నికోటలిన్, నికోటేన్, త్వరగా మండునట్టియు సువాసననిచ్చునట్టి యునికోటియానిన్ అనునవి పొగాకుకు సువాసననిచ్చుటయేగాక దానిలో నొకవిధమగు చమురుకూడా పుట్టించుచున్నవి. పొగాకు కాలుచుండగా పిరిడిన్, పికోలిన్, కొలిడిన్ అనువాయువులుకూడా అందుండి బైలుదేరును. వానితో కార్బలిక్ అను ద్రావకమును, నవాసారమును, పంకవాయువును, సైనోజిన్, హైడ్రోయానిక్ ద్రావకములును, కార్బన్ మనోక్సైడ్ (బొగ్గువాయువు) ఫర్ఫురల్ మొదలైనవికూడా యిందులోనుండి వెలువడును." అని ఆర్వింగ్ ఫిషర్. పి, హెచ్. డి. డాక్టర్, యూజీన్, లైమాన్, ఫిస్క్, ఎమ్. డి. గార్లు వ్రాసిరి.

### పొగాకునందలి విషములుచేయుపని.

1. నికోటిన్ "నికోటిన్ ముఖ్యముగా గుండెనుపట్టి పనిచేయు విషము. అదిరక్తనాళములమీదను, ఉలవకాయలమీదను పనిచేయుచు (ధమనులను) శుద్ధరక్తనాళములను గట్టిపరచినందుచే రక్తమును త్వరితముగా పారునట్లుచేయును.

పెరిరావస్తుగుణదీపిక 567-వ పేజీలో "నికోటిన్ బహుగాఢమైన విషమనియు నిమిషమాత్రములో ప్రాణమునకుగల సత్తువను చురుకుతనమును తీసివేయగల హైడ్రోసియానిక్ అను ద్రావకమువంటిదై యున్నదని తెలియగలదు.

ఒక పిల్లవాడు మొట్టమొదట చుట్టత్రాగ నుద్దేశించునట్లు చేయునది నికోటైన్ విషము వానిపొట్టలోను, పేగులలోను, అదిచేయుచున్నపనియే. దుర్వాసనయు విరోచనమగుటయు చుట్టత్రాగమొ

దలుపెట్టగానే కలుగుచుండునుగాని యివిదానియందలి విషమువలననే కలుగుచున్నవి. వైద్యమునందు నిపుణుడగు సర్ లాడర్ బ్రంటన్ అను యిటీవల మరణించిన యింగ్లీషు వైద్యుడు "పొగాకు నందలి నికోటిన్ మొదట సంధిగుణములను పిమ్మట పక్షవాతమును కలిగించు ననిచెప్పెను. దీనిని నొకకప్పకు కొద్దికొద్దిగా వాడుచువచ్చిన యెడల దానిగుండె మొదట మెల్లగాను, పిమ్మట వేగముగాను కొట్టుకొనును. పాలిచ్చుజంతువుల కుపయోగించిన వానిగుండెను మొదట మెల్లగాను, పిమ్మట రక్తము త్వరితముగా పారుటకై వేగముగను కొట్టుకొనునట్లు చేయును.

2. కొలిడిన్. "పొగాకుకుగల సువాసనకిదియే ముఖ్యము. కొలిడిన్, నికోటిన్ యంతటి స్వభావము కలిగినదై యున్నది. ఒకచుక్క కొలిడిన్‌లో 20-వ వంతును తీసి కప్పకు వేసిన యెడల వెంటనే కప్ప చనిపోవును. ఒకమనుష్యుడు దీనిని కొన్ని రెప్పపాటుల కాలము పీల్చుకొనినయెడల నరములలోని సత్తువ తగ్గి నిస్త్రాణ పుట్టించును." అని డాక్టర్ జార్జి తామసన్ ఎమ్. డి. ఎఫ్. ఆర్. సి. ఎస్. గారు చెప్పిరి.



పెద్దలుచేయు వాటిని పిల్లలు కనిపెట్టి చూచి వాటినే చేయనారంభింతురు.

3. ప్రసిక్ ద్రావకము, "ఇది బహుచురుకైన విషమై యున్నది. పొగాకునందు యీ ద్రావకమున్నదని నిశ్చయించుటకై త్రాణలేకయుండుట, తలనొప్పి, ఒకవిధమగు బాసనయు దృష్టాంతములైయున్నవి. ఈవిషము వివిధములగు పొగాకులకు హెచ్చు తగ్గులుగా నుండునుగాని హవన్నా పొగాకునందు మిక్కుటముగానుండును. పొగాకు త్రాగు గొట్టములందు (చాంగముదలైన) నిలువయుండు నల్లని చిక్కనిద్రవమునందు ప్రసిక్ ద్రావకమును, నికోటైన్‌యును అమితముగా చేరియున్నవి." అని డాక్టర్ జార్జి తామసన్. ఎం. డి. ఎఫ్. ఆర్. సి. యస్‌గారు వ్రాసిరి.



4. కార్బన్ మనోక్సైడ్, (బొగ్గుగాలి), రాక్షసిబొగ్గు పూర్ణము గాదహించబడినప్పుడు దీపములవెలిగించు విషవాయువుకుండు గుణములేదీనికి గూడాగలవు. కార్బన్ మనోక్సైడ్ ఎఱ్ఱని రక్తకణములకు సోకిన యెడల అవిప్రాణవాయువును పీల్చుకొను శక్తిలేనివగునట్లు చేయసమర్థతగల విషవాయువై యున్నది. అనగా మనరక్తములోనున్న యినుముప్రాణవాయువును తీసికొననిది రక్తమునకు చలనముకలుగ చేయనేరదు, అట్లు ఆయినుమును శక్తిలేనిదిగా చేయునదియే యీ వాయువు. ఈ వాయువుదేహమునకు తగిలినతోడనే గుండెకు దడగలిగి జన్నిపుట్టును. దీనినెక్కువగా ఉపయోగించినయెడల కండ ఉబ్బును. దేహమంతయు చెమటపుట్టి, చల్లపడి మూర్ఛవచ్చి చివరకు దేహము మొద్దుబారును.

5. ఫర్ ఫురల్ ఘాటు గలిగిన సీమసారాయిలకుండు విషము వంటిదైయున్నది. ఇదిమధుసారముకంటె 50 రెట్లుయెక్కువ విషతుల్యమైయున్నది, ఒక సిగరెటునందున్న 2 ఔన్సుల విస్కీలోనున్నంత ఫర్ ఫురల్ అనునది ముఖ్యముగా జ్ఞానేంద్రియములకు నష్టముకలుగ జేయును. సాధారణముగా సిగరెట్ త్రాగువారిదేహము, నరములు దణుకు గలిగియుండును. పడుచువారికుండు జ్ఞానవివేచనలు బొత్తిగా క్షీణింపజేయును. ఈ విషమునైనను దీనిపొగనైనను మనములోపలికి పీల్చుకొన్న యెడల సిగరెట్‌యందలి దుర్గుణములు విశదముగ తెలియగలవు.

6. అక్రోలిన్. "మనుష్యదేహమునకు అక్రోలియన్ చాల విపత్తు తీసికొనివచ్చును. విషములలోనిది మహాఘోరమైన విషము. సిగరెట్ తయారుచేయు కాగితము కాలునప్పుడు దానినుండి యెక్కువగా అక్రోలిన్ బైలువెడలును దానిపొగ రేపే గుణముగలదగుటచేనది

బొత్తిగా నుపయోగింపరాదు. ఈ రేపేగుణమే సాధారణముగా పిల్లలు పిచ్చివారగుటకు కారణమైయున్నదని నానమ్మకము. అప్పు డప్పుడు మేము దీనిని గ్లిసరిన్ అను ఒక తియ్యని పదార్థమునుండి మూరసాయనికశాలలో తయారుచేయుదుము. దీని ఘాటు మాసహా ధ్యాయులలో నొకరిని యీ కట్టడములోనుండి బైటకు పోవునట్లు చేసెను. అక్రోలిన్ యొక్క చెరుపునుగూర్చి నేనువిస్తరించి మాట్లా డను. అయినను ఒక పిల్లవాడు తాను సిగరెట్ త్రాగునప్పుడెల్లను దీనితోపని గలిగియుండును" అని అనేక గొప్పసంగతులను కనిపెట్టిన థామస్ ఎడిసన్‌గారు వ్రాసిరి.

## పొగాకుపయోగింపబడుచున్నవిధములు.

ఐదువిధములుగా పొగాకుపయోగింపబడుచున్నది. వీనిఉపయో గమువలన కలుగు నష్టమునుబట్టి యెక్కువకీడు కలిగించునది మొద టను, తక్కువ కీడు కలిగించునది చివరను వరుసగా నీ దిగువను వ్రాయబడినవి. 1. సిగరెట్లు, 2. ముక్కుపొడుము, 3. పొంగ్రత్రా గుట, 4. చుట్టత్రాగుట, 5. పొగాకు నములుట, (ఆర్. యస్. కమ్మింగ్స్. ఎమ్. డి.)

## పొగాకు త్రాగుటవలన కలుగు కీడులు.

పొగాకు త్రాగుటవలన యీ క్రిందుదహరించిన కీడులనుగూర్చి తెల్పిన అనుభవశాలుల వ్రాతలిచ్చటుదహరింప స్థలముచాలకున్నం దున గ్రంథకర్త అట్టికీడులనుగూర్చి క్లుప్తముగా వ్రాసెను.

1. పొగాకు ఓర్పులేమికలిగించును.
2. ఇంద్రియ నిగ్రహము చెరచును.
3. ఖండితముగా నుండకుండ జేయును.
4. గురిచూచుశక్తిని తగ్గించును.
5. వివిధరంగుల్లను గుర్తుపట్టు శక్తిని తగ్గించును.



6. పొగాకు హృదయమునుపాడుచేసి తనయందాశగలిగిన వాని హృదయమునట్లు మార్చును.
7. పక్షవాతము దెచ్చును.
8. ఇతరులు పీల్చుకొను గాలిని చెడగొట్టును.
9. అర్థాయుస్సును దెచ్చును.
10. చుట్టత్రాగుడు మనుష్యుని యొక్క కాలమును వృథాచేయు టయేగాక వానిమనస్సు యొక్క స్థిరత్వమును పోగొట్టివాని నస్థిరుని జేయును.
11. పొగాకు మనుష్యుని గొప్ప పాండిత్యము పొందకుండను మంచి మనోశక్తి సంపాదించకుండను చేయును.
12. తరుచుగా నిద్రలేమిని కలుగ జేయును.
13. పులితేన్పుకలుగ జేయును.
14. దేహమునకు వణుకు బుట్టించును.
15. చిన్నపిల్లల నెదుగనియ్యక కృశింపజేయును.
16. చుట్టత్రాగనివారి భార్యలకంటె త్రాగెడువారిభార్యలుసహా జముగా గొడ్రాండ్రై యుందురు.
17. చుట్టత్రాగెడువారి బిడ్డలు బలహీనస్థితిలో నుందురు.
18. చిన్నతనమందే దొంగతనముచేయు పిల్లలలో నూరింట 95 మొదలు 98 మంది చిన్నపిల్లలు చుట్టలుత్రాగువారై యున్నారు.
19. పొగాకు త్రాగుటవలన రక్తము బహుత్వరితముగా రక్తనాళ ములలో ప్రవహించును.
20. పొగాకు ధమనులను రక్తనాడులను గట్టిపరచును. ఇదివృ ద్ధాప్యప్రారంభమునకు ప్రధాన చిహ్నము.
21. అదిసన్నిపాత రోగమునకు కారణమగును.
22. కంఠధ్వనిని మార్చును.

23. పొగత్రాగుడునోటియందు మేహపొక్కులను బుట్టించును.

24. ఊపిరి తిత్తులను పాడుచేయును.

25. "బ్రైటిక్స్" అను రోగమును కలుగజేయును.

26. రుచిని, ఘ్రాణేంద్రియమును చెరచును.

27. జ్ఞాపకశక్తిని తగ్గించును.

28. రోగమును యెదిరించుశక్తిని తగ్గించును.

29. నేరములు జరుగుటకొరకిది యొకకారణము.

30. కాలుచున్నచుట్ట, సిగరెట్ ముక్కలను పడవేయుటవలన నిప్పంటుకొని అనేకప్రాణములు, ఆస్తి తగలబడుటకు కారణముగా నున్నది.

31. చుట్టలు త్రాగువారు సాధారణముగా త్రాగుబోతులై యుందురు.

32. నరముల పటుత్వమును పాడుచేయును.

33. ఎక్కువఖర్చునకిది యొక కారణమైయున్నది.

34. పొగాకుపయోగించువాని హృదయమును, సహజగుణమును, స్వభావమును పాడైపోవును.

## సిగరెట్ గణితము.

"నేనొకగొప్ప గణితశాస్త్రజ్ఞుడనుకానుగాని ఒకమనుష్యుని నరములనొప్పులకు నేనుకొంచెము కలుపగలను. వాని దేహపటుత్వము నుంచి కొంచెము తీసివేయగలను. వానిదేహమందలి నొప్పులను హెచ్చించగలను. వానిజ్ఞాపక శక్తులను విభజించ గలను. వాడు నన్ను త్రాగుటవలన వానికి కలుగుకీడ్లు నేను వడ్డిగాపుచ్చుకొందును. వాడు తెచ్చుకొను ఫలితములో నేనుకొంత త్రోసివేయగలను" (discount) అని సిగరెట్ చెప్పుచున్నది.



## విదేశాధికారులిచ్చిన సాక్ష్యము.

1. ఘనత వహించిన 1-వ జేమ్సురాజుగారు చూచుటకు అసహ్యమైనట్టియు వాసనచూచుట కిష్టముకానట్టియు మెదడునకు నష్టము కలిగించునట్టియు ఊపిరితిత్తులకపాయకరమైనట్టియు అగాధమైన నరకములోని పొగకు బోలినట్లుండి దుర్వాసనగల, పొగగలయలవాటు" అని సిగరెట్టును గూర్చి చెప్పిరి.

2. "సోమరులకుల్లాసము కలిగించెడియలవాట"ని నెపోలియన్ బోనాపార్టు చెప్పెను.

3. యునైటెడ్ స్టేట్సునకు ముఖ్యపట్టణమగు వాషింగ్టన్‌లో దొంగతనముచేయు పిల్లలను శిక్షించుకచ్చేరియందిదివరలో ముఖ్యోద్యోగస్థులుగానున్న జెడ్. కాప్‌గారు సిగరెట్ "దేహమందు కోపము, తాపము, కామము మొదలగునవి మందుగుండు సామానుగట్టనజేసినట్లున్నవి. జానికితాడామందుగుండు సామానునుండిమంటనేవిధముగా బైటికిదీసికొని వచ్చునో యీసిగరెట్ ఆరీతిని దేహములోని కోపము మొదలగువానిని బైటకు తీసికొని వచ్చును. గత 3 సం॥లలో 16,000 మంది అపరాధము చేసిన పిల్లలనుచూచితిని, మొత్తముమీద సిగరెట్లుత్రాగువారే దేహమందును, మనస్సునందును, బుద్ధియందును వెనుకపడియున్నార"ని చెప్పిరి.

4. యూనియన్ పసిఫిక్ యనుపదారినడుపు అధికారుల సంఘమున కగ్రాసనాధిపతియగు హారిమాన్‌గారు "సిగరెట్ త్రాగువారికి క్షేమము లేదనియు, సిగరెట్లు త్రాగువారికంటె పిచ్చివారియాశ్రమమునుండి యినుపదారిమీద పనిచేయుటకు మనుష్యులను తెచ్చుట మేల"ని చెప్పిరి.

5. పిచ్చివారిని గూర్చిన శాస్త్రమందు నిపుణుడగు ఫోర్బ్సవిన్‌స్లోయను వైద్యుడు "పిచ్చితనమునకు త్రాగుడు మొదటికారణమున్ను, సిగరెట్టు త్రాగుట రెండవకారణమున్ను, వంశపారంపర్యము మూడవదైయున్నది" అని చెప్పిరి.

6. పిల్లలు సిగరెట్టు త్రాగుటవలన మెదడు అడుగు భాగమున నుండు నరములను చచ్చుపడజేయును. ఊపిరించునప్పుడు గుండె చేయుపనికి ఆటంకము కలిగించును. కన్ను, గుండె ఉలవకాయలు చేయుపనిని కూడా అడ్డగించును. చుట్టత్రాగుటవలన పిల్లవాడెదుగక క్షీణించును.'' అని కేంబ్రిడ్జుకళాశాలలో రోగ నిదానశాస్త్రనిపుణుడగు సింస్‌వుడ్ హెడ్ అనువైద్యుడు చెప్పెను.

7. సిగరెట్లు త్రాగుపిల్లలు పురుగులతో నిండిన పండ్లవంటివారనియు, వారు కోతకాలమునకు ముందే రాలిపోవుదుర''ని లీలాండ్ స్టాన్‌ఫోర్డ్ జూనియన్ యూనివర్సిటీ యధ్యక్షుడగు డేవిడ్‌స్టార్ జార్డన్ చెప్పెను.

8. చికాగోనందలి ఆటలు, దేహపరిశ్రమ మొదలగునవిగల కళాశాలనాయకులకు, ఏ. ఏస్టాగ్ అనువారు ‘‘చికాగోనందలి దేహపరిశ్రమ పాఠశాలలో తర్ఫీతుపొందుచుండు వారందరు పొగాకు, మత్తుపదార్థములు, త్రాగుడు మొదలగువాని ఉపయోగమును విరామము లేకుండ నడ్డగించిర''ని చెప్పెను.

9. పొగాకు ప్రస్తుత నాగరికులగు సర్వజనులకు నొక గొప్ప పిశాచమ''ని రస్కిన్ అనువారు చెప్పిరి.

10. ఉద్యానకృషికులగు లూథర్ బర్ బాంక్ అను అమెరికా దేశస్థుడు ‘‘మిక్కిలిసూక్ష్మబుద్ధియు, చురుకుతనమును అవశ్యమగు పనులు జేయవలయుననిన మత్తుపదార్థము లేవైనను బహు కొంచెమైనను ఉపయోగించిన అట్టి పనులు నెరవేరవని నేను రుజువుపర్చగలను. మృదువైన చెట్టు మొగ్గలను కత్తిరించు శక్తిలేనివారిని పరీక్షించగా దాదాపుగా అట్టివారందరుచుట్ట, మత్తుపదార్థముల ఉపయోగించెడి వారినిగా కనుగొంటిని. దినములకు రెండు మూడు చుట్టలనుత్రాగువారు సహాసున్నితమైన పని నేదియు చేయజాలరు''అని చెప్పిరి.

11. కొలంబియా వైద్యకళాశాలనాయకులగు జి. ఎల్. మిలాన్ గారు తాము ఆరోగ్య శరీరశాస్త్రములను 24 సంవత్సరములనుండి



బోధించుచుండినను వయస్సునందు పెరుగుచుండెడి యౌవనులకు పొగాకు బహు అపాయకరమని దృఢముగా నమ్మిరి.''

12. ఫోర్డు మోటార్ బండ్లను కల్పించిన హెన్‌రిఫోర్డు అనువారికి థామస్ ఏ. ఎడిసన్ అను నాయన యీక్రింది విధముగా వ్రాసినట్లు ‘‘గుడ్ హెల్త్ (మంచి ఆరోగ్యము)'' అనునమెరికా పత్రికయందు 1914-సం॥ జూలై నెలలో ప్రచురింపబడెను. ‘‘స్నేహితుడా! సిగరెట్‌నందలి అపాయకరమగు విషము ముఖ్యముగా దానిపైని చుట్టబడిన కాగితములోనేయున్నది. అట్టికాగితము కాలునపుడు ఏర్పడునది అక్రోలిన్ అనునదియే. అదినరముల కూడికలయందు బహు విపరీతముగా పనిచేయును. అందువలననే అనేకమంది పిల్లల జ్ఞానేంద్రియములు బహుత్వరితముగ క్షీణించుట కారణమాయెను. ఇట్టిక్షీణతగలిగించు యితర మత్తుపదార్థములకంటె దీనివలన వచ్చు క్షీణత కలకాలము నిలుచునదియై రానురాను నిరాటంకముగ వృద్ధియగుచున్నది. సిగరెట్ త్రాగువారెట్టివారైనను నేను పనిలోపెట్టుకొనను.''

## హిందూదేశమందున్న ప్రాముఖ్యులగు 4 గురువైద్యులవలన యివ్వబడిన సాక్ష్యము.

1. రాయబహదూర్ చునిలాల్‌బోస్ ఎం. బి. ఎఫ్. సి. యస్. అనునాయన గవర్నమెంటు పక్షముగా రసాయనిక పరిశోధకులను వైద్యుడు ప్రచురించిన ఆరోగ్యమునుగూర్చిన పుస్తకములో ‘‘శారీర స్వాస్థ్యవిధం'' అనుదానినిగూర్చి యీక్రిందివిధముగావ్రాసిరి. ‘‘పొగాకు యేవిధముగా నుపయోగించినను అదివిషసంబంధమైన వస్తువైయున్నది. అదికొద్దికొద్దిగా వాడబడిన ప్రతిసారియు దానియందుగల

నికొటిన్ అనువిషము మొదటకొంచెము మత్తును కలిగించును. మోతాదుబహుకొంచముగా నెక్కించినను తలనొప్పి, నోటిదుర్గంధము, వాంతి, ఒళ్లుబద్ధకము, నిద్రలేమి, చూపు, వినికిడితగ్గుట, చెమటగల్గియుండుట, అరచేతులెండుట యీలక్షణములు కలిగించును. పిల్లలయొక్కయు, * పడుచువారి యొక్కయు, నరములు అవయవములు పొగాకుయొక్క విషములు మొదలగునవి తగులుటచే మార్పుజెందుచుండును. వారికి జీర్ణముకలిగించుశక్తితగ్గును. మనస్సుయొక్క ఆలో



(1) పొగత్రాగనివాడు బహుచురుకుగా పని చేయును.    (2) పొగత్రాగువాడు బహుమందముగాను అజాగ్రత్తగాను పనిచేయును.

చనాశక్తితగ్గును. జ్ఞాపకశక్తి బలహీనమగును. రాను రాను ఒంటిబద్ధకస్తులగుదురు.

2. కలకత్తా కళాశాల పరీక్షకులును, వైద్యులునగు రాయబహాదూర్ హరినాత్ ఘోష్, ఎం. డి. గారు పాఠశాల కొరకై రచించిన "స్వాస్థ్యతత్వ" అను పుస్తకములో నిట్లువ్రాయుచున్నారు. "విద్యార్థులకు పొగాకు అపజయముదెచ్చును. జ్ఞాపకశక్తితగ్గుటయు, గుండె





బలహీనమగుటయు, త్వరితముగా కొట్టుకొనుటయు, ఆకలితగ్గుటయు, కంటిచూపుతగ్గుటయు, మొదలగునవి యన్నియు సంభవించును.

3. వైద్యులగు సుబుధ్ చంద్రమిత్తర్, ఎల్. ఎం. ఎస్. గారు "స్వాస్థ్యసమాచార" అనుపుస్తకములో నిట్లువ్రాసిరి. "పొగాకు త్రాగుటవలన పొడిదగ్గు, గొంతులోనొప్పి, స్వరముమారుట, తుదకు క్షయదగ్గును కలుగును. గుండెచేయుపనియు భేదించును, మెదడుబలహీనమగును, కండరములు సడలిపోవును, పనిచేయుట కిష్టము లేకపోవుట, ఆయాసముకలిగియుండుట, చురుకుతనములేకపోవుట, జ్ఞాపకశక్తి తగ్గుట, తలనొప్పి, నరముల బలహీనము, నిద్రలేకపోవుట మొదలగు చిహ్నములు మెల్లమెల్లగా పొగాకునందు అభిలాషగలవానియందు అగపడును. పొగాకు అమితముగా త్రాగినయెడల చూపుమందగించుటయు, అరుచి, సహజముగా చెముడుకూడాకలుగును.

4. కలకత్తా కళాశాలయందలి కవిరాజ్ శ్రీయుక్తయామినీభూషన్ రాయ్, కవిరత్న, ఎం. ఎ. ఎం. బి. గారు ఆరోగ్యమును గూర్చి రచించిన "స్వాస్థ్యనీతి" అను పుస్తకములో నిట్లు వ్రాయుచున్నారు. "పొగాకు త్రాగువారిబుద్ధి మందగించి కడుపుమీద ఎర్రని మచ్చలేర్పడి, ఊపిరితిత్తులుచెడి, గుండె బలహీనమై, రక్తముచే చుట్టబడినందున రక్తమును ప్రవహింపజేయ లేకపోవుటయు, రక్తము పలుచనగుటయు మొదలగునవి సంభవించును, చాలాకాలము పొగాకుపయోగించుట వలన రోగముల నెదిరించుశక్తియు, జీర్ణకోశమందలి శక్తియుతగ్గి, గొంతుపుండుపడి, గుండెభారముగల్గి క్షయదగ్గుయేర్పడి పక్షవాతము గలిగి, నిస్త్రాణగలిగి యింకా అనేకవిధములగు నష్టములుగలుగును పొగాకు నుపయోగించువారి బిడ్డలు సాధారణముగా బలహీనులై యుండి, తమయింద్రియముల వశపరచుకొన లేకుందురు.

## సిగరెట్ కాల్చునప్పుడు పడిన నిప్పువలన కలిగిన ఉపద్రవములు.

ఈక్రింది యుదాహరణములు. "స్టేట్స్మన్" అనునొక పత్రిక నుండి ఎత్తి వ్రాయబడినవి.



పొగత్రాగుడు, పడుచువారిని వారిదేహవిషయములోను, మనస్సువిషయములోను, మంచినడవడివిషయములోను ఎంతమాత్రమువృద్ధిపొందనియ్యదు.

1. అపాయకరమగు వాడుక ఉపద్రవమునకు కారణమైయున్నది. శనివారము ఉదయము సుమారు 2-ఘంటల వేళకు కలకత్తా యందలి 40-వ నంబరు వెలస్లీ వీధిలో నొక చిల్లర అంగడి నిప్పంటుకొనెనని ముఖ్యనిప్పు ఉపద్రవరక్షక సైన్యము (Central Fire Brigade) నకు కబురు వచ్చెను." ఆనిప్పు, ఆయంగడికి వచ్చు వాడుకదార్లు తమతమ సిగరెట్లు మొదలైనవి కాల్చుకొనుటకై నిప్పంటించి యుంచబడిన యొకనులకత్రాడును ఆర్పుటకు మరచినందున కలిగిన ఉపద్రవమని యీ పత్రికయే చెప్పుచున్నది. "స్టేట్స్మన్, ఆగస్టు 31,1918.

"కాన్‌స్టాంటినోపిల్"

"జ్ఞాపకముంచుకొన వలసిన గొప్పనిప్పు యుపద్రవము రెండు లక్షల జనులకు గృహములు లేకుండజేసెను. ఇట్టిభయంకరమును, మరువరాని యుపద్రవము కాన్‌స్టాంటినోపిల్ అనుపట్టణములో మే నెల 31-వ తేదినుండి జూన్ 2-వ తేది వరకు జరిగెను. స్టాంబోల్ అను భాగములో సుమారు 2½ మైళ్లు యీయుపద్రవము వ్యాపించెను; అందులో 10 ముఖ్యభాగములును, ఐదు వేలయిండ్లును, పన్నెండు అంగడి వీధులును, 10 మసీదులును తగులబడెను. రెండులక్షల జనములకు నివాసము లేకపోయెను. ఈయుపద్రవమునకు కారణము కాలుచుండిన యొక సిగరెట్ముక్కవలననే కలిగినది "రూటర్", "ది. స్టేట్స్మన్," జూన్, 25—1918.



## చుట్టత్రాగుడు నాపుటకైజరిగిన కొన్ని యేర్పాట్లు.

గౌరవార్హులగు, యస్. నెమెటోగారిచే, జపానీయుల యిండ్లలో చుట్టత్రాగకూడదను చట్టమేర్పరచబడి జపాను పరిపాలకులచే నదియొకచట్టముగా 1900-సం : ఏప్రిల్ 1-వ తేదినుండి అంగీకరించబడి అమలులో పెట్టబడినది. ఆయన యీక్రింది విధముగా చెప్పెను. "ఎందుకీ చట్టమమలులో పెట్టబడెనో యాకారణము క్లుప్తముగా వివరించెదను. ప్రస్తుతమందున్న అందరికొరకైనో పాఠశాలలలో చదువు పిల్లలు సహాస్వల్ప ధరలతో నీదేశమున ఒగుమతియగు సిగరెట్లను త్రాగుచుండుటచే, అట్టియలవాటు వలన చీనా, హిందూదేశములకు కలిగినదుస్థితియే మనకును్న కలుగునను భయమే ముఖ్యకారణము. ఎందుకనగా నల్లమందులో నున్నట్లు పొగాకునందున్నునుత్తుకలిగించు విషమున్నది. ఆవిషములు నరములను మొద్దుపడజేసి పిల్లలజ్ఞాపకశక్తిని బలహీనపరచును. గనుక మనము స్వదేశాభిమానముకలిగి మనపిల్లలుగాని, యావ్వనులుగాని బొత్తుగా వానినంటకుండజేయప్రయత్నించవలెను. ఐరోపా, అమెరికాలయందలి జనులస్థితి కంటె యెక్కువస్థితికి మనస్వదేశీయులను దేవలయునన్న మనబిడ్డలను, పడుచువారిని, వారుముందు మనదేశములో తల్లిదండ్రులుగా వలసియుండుటచే చుట్టత్రాగుటయందు నిపుణులుండే పాఠశాలలకు పంపకుండుట యుక్తము. అమెరికానందలి "సిగరెట్ త్రాగుడునాపప్రయత్నించు సంఘమును మరియట్టి యనేక సంఘములునులోకమం

దనేక భాగములలో వ్రాతలమూలముగను, ఉపన్యాసముల మూలముగను యీ అసహ్యకరమగు నలవాటు మాపుటకై వారిశక్తికొలది ప్రయత్నించుచున్నారు.



చుట్టపొగ తెల్లని రుమాలుమీదనూదిన యెడల పసుపు డాలు పడును.

బంగాళాదేశములో శాసనము లేర్పరచు అధికారులు "నేరస్థులు పొగత్రాగకూడద"ని శాసించిరి.

"మైసూరు రాజ్యములో పొగ త్రాగకూడదను శాసనము 1911-వ సం॥లో యీ రాజ్యమునకు దివానులుగా నుండిన ఆనంద సి. ఐ. యి. అనువారిచే నేర్పరచబడెను.

ఘనతవహించిన హైదరబాద్ నిజామ్‌వారు (నవాబ్) "పదునారు సంవత్సరములకులోబడిన వాడెవడైనను పొగచుట్టలు త్రాగిన యెడల శిక్షించబడునని చట్టమేర్పరచెను.

బీహార్ ఒరిస్సాలలోని విద్యాసంబంధనాయకులు తమయధికారమునకులోబడిన విద్యాసంబంధకార్యదర్శకులకు, పైవిచారణ చేయువారికి, ప్రధమోపాధ్యాయులకు 1915-వ సం॥ ఫిబ్రవరినెల 13-వ తేది రాంచినుండివ్రాసిన యుత్తరములో నిట్లు తెలిపెను. "లేతవయస్సులో పొగచుట్టలు త్రాగుటచేత కలుగు కీడులు యెన్నటికిని తొలగనివైయుండుటచే విద్యార్థులను నడుపు ప్రతివారు యీ దుర్వాడుకను మాన్పుటకు ప్రయత్నించవలయును. విద్యార్థులు చుట్టలుత్రాగకూడదు. ఈచట్టమును బడియందుగాని బైటగాని మీరినయెడల ఒక గొప్పతప్పితముగా నెంచబడును. వారిని వృద్ధిపొందనియ్యని యీ దుర్వాడుకల నుండి హెచ్చరించుచుండవలయును, (Sd.) జె. ఎచ్. జెనింగ్స్. యిరోపాలోని పొగబండ్లలో "చుట్టత్రాగువారికి" "చుట్టత్రాగనివారికి" అని వేర్వేరు భాషలలో వ్రాయబడిన వేర్వేరుబండ్లుండుట చూడగలము.



కలకత్తానుండి యింగ్లాండు దేశమునకు పోవుపొగయోడలలో "చుట్టలుత్రాగకూడదు" అని వ్రాయబడిన పలకలు వ్రేలాడుచుండుట కనబడును. హిందూదేశమందలి పొగబండ్ల చట్టముకూడా చుట్టలుత్రాగకూడదని చెప్పుచున్నట్లు యీ క్రిందివానిచే కనుగొనగలము. చుట్టలు త్రాగుట కేర్పరచబడని యేపెట్టెలోనైనను గదిలోనైనను తనతో ప్రయాణముచేయు ప్రయాణీకుని యిష్టములేనిది యేమనుష్యుడైనను చుట్టలు కాల్చగూడదు. అట్లుకాల్చినయెడల 20 రూపాయలకుమించని జరిమానా విధించబడును. ఈ చట్టమెరిగియుండియు భిన్నముగా ప్రవర్తించినయెడల యినుపదారి సంఘములో పనిచేయు యేనౌకరివల్లనైనా అట్టిబండిలోనుండియు, సరిహద్దులలోనుండియు, బైటకువెళ్లగొట్టబడును" అనిపొగబండ్ల చట్టములలో 110-వ చట్టము తెలుపుచున్నది.

తూర్పు బంగాళాదేశమునుండి బైలుదేరు పొగయోడలలో నీ క్రింది ప్రకటనకనుగొనవచ్చును.

"ఐ. జి. నావిగేషన్ అండ్ రెయిల్వేకంపెని, లిమిటెడ్"

## ప్రకటన.

"హుక్కా, చుట్టలుకాల్చుట, తాంబూలము, ఓడగదులలోగాని, భోజనశాలలలోగాని ఒకటవతరగతి ప్రయాణికులుండు పైతట్టుమీదగాని బహుఖండితముగా నిషేధించబడినవి".

కలకత్తాయందలి విద్యుత్సక్తివలన నడుపబడు బండ్లలో (Trams) అందరికగుపడునట్టి పెద్దయక్షరములతో మొదటిరెండు కూర్చుండు బల్లలమీదనుండువారు బొత్తుగాచుట్టలు త్రాగకూడదని వ్రాయబడియుండుట చూడవచ్చును. దేవసమాజమువారి నీతులలో నొకటీలాగు చెప్పుచున్నది. "మత్తుకలుగ జేయుటకై మత్తునుగలిగించు పదార్థములను, ద్రాక్షారసము, నల్లమందు. భంగు, పొగాకు, చారాస్, చండూ, కొకేన్ మొదలగు నేవియైనను ఉపయోగించను, తయారుచేయను, కొనను, అమ్మను, లేదాయెవరికైనను యివ్వను" అని చెప్పుచున్నది.

# పొగాకు అలవాటును మాన్పు టెట్లు.

ఔషధము—వాడువిధము.

ఒకవడ్లగింజయెత్తు సిల్వర్ నైట్రేట్ (Silver nitrate) అను ఔషధము శుభ్రమైన ఒక ఔన్సు వర్షపు నీటిలోగాని ఆవిరిద్వారాతీయబడిన నీటిలోగాని కలిపి కరుగనిచ్చి ఆనీటిని రంగుగల బుడ్డిలో పెట్టి యుంచుకొనవలెను. ఈనీటితో ప్రతిదినము భోజనమైన పిమ్మట నోరుపుక్కిలించి ఉమ్మివేయవలెను.

ఈ మందు విష సంబంధమైనది గనుక పుక్కిలించునపుడు మింగకుండ జాగ్రత్తగానుండవలెను.



“ఘర్ మసాలాతో తయారుచేసిన వంటకములను భుజించుట, మత్తుగలపదార్థములు త్రాగుట, పొగాకునందాశ కలిగించునుగాన సాధారణమైన భోజనము, పాలు, పండ్లు పుచ్చుకొనిన అట్టి యాశయుండదు. పొగాకు యలవాటును మాన్ప ప్రయత్నించు కాలములో రెండుమూడు వారములవరకు సామాన్య ధాన్యపు భోజనము, కూరగాయలు, కాయలు, పండ్లు, పాలు మొదలైనవి మిరియాలపొడిగాని మిరపకాయల కారముగాని లవంగములు మొదలగు కారముగల సువాసన ద్రవ్యములుగాని వేసి



వంటచేసి పుచ్చుకొన కూడదు, ప్రతివారుభోజనమైన పిదప నారింజ, సీమరేగు, ద్రాక్ష, రేగుమొదలగు పుల్లనిపండ్లను దినవలయును. మజ్జిగపెరుగు ఉపయోగించవలయును.

“పొగాకునందలి నికొటిన్ అనువిషమును విడుచుటకై రాషియల్ (Rochelle) సాల్టును క్రీమ్ఆఫ్ టార్టార్ (cream of tartar) ఒకపావుసేరు నీళ్లలోవేసి ఉదయపు భోజనమునకుముందు వారము వరకు పుచ్చుకొనవలయును” లేదా యీ పొగాకలవాటును విడుచు కాలములో మొదటి వారారంభమందును, అంతమందును ఎప్సమ్ సాల్టుఅను భేదియుప్పును విరేచనమగుటకై పుచ్చుకొనవలయును. పిమ్మట మూడు నాలుగు వారముల వరకు వారమున కొక్కసారి మాత్రము ఆముదము పుచ్చుకొనుచుండిన చాలును. ప్రతియుదయము నిద్రనుండి లేచుటతోడనే చన్నీళ్లస్నానమునుజేసి శుభ్రమైన తువాలుతో తడిలేకుండా తుడువవలయును. ఈ యసాధ్యమగు నలవాటును జయించవలెనంటే అన్నిటికిపైగా దైవసహాయము ప్రార్థనలద్వారా కోరవలయును. దేహమునందిమిడియున్న పొగాకు విషము విరిగిపోయిన పిమ్మట మరల దానిమీద ఆశయుండదు.

———



నల్లమందు, తేయాకు ఆరోగ్యమును పాడుచేయును.

## గంజాయి, చారాస్, కొకేన్, నల్లమందు.

# 3. అధ్యాయము.

భంగు, చారాస్, హషిష్, కొకేన్, నల్లమందు. మొదలగు మత్తు ద్రవ్యములు హిందూదేశమందలి జనులను పీడించుచున్నవి.

"గంజాయి, చారాస్ అనునొకవిధమగు ఆకున్ను, పంజాబు, సంయుక్త రాష్ట్రములు, తూర్పు బంగాళము, బీహారు, కలకత్తా మొదలగు స్థలములలో బహువిస్తారముగా నుపయోగింప బడుచున్నవి. బొంబాయికూడా యెక్కువగానే యుపయోగించుచున్నది. మధ్యపరగణాలలో చారాస్ అను ఆకు నెక్కువగా యుపయోగించుదురు. వినన్ సింగ్ డక్కా అను తూర్పు బంగాళమునందలి భాగములలో మంజిస్ అను పడవపనిచేయు నొకజాతివారు విశేషముగా నుపయోగించుదురు. బంగాళము నందలి రాజసాహియను జిల్లాలో నయెగాగ్ అనుభాగములో గంజాయి పంటపండును. ఈ యాకుసుమారు 10 ఎకరముల భూమిలో బహుజాగ్రత్తగా తనిఖీ చేయబడి సిద్ధపర్చబడుచున్నది. దేశాధికారులుకూడ నితరయొకచోట పెంచుటకు సెలవియ్యక పోవుటమంచి విషయమే.

"కొకేన్ అనునది దక్షిణ అమెరికాలోని పైరు దేశములోపెరుగు కొకేన్‌చెట్టునుండి తయారుచేయబడినది. మద్యసారమెట్లు మనదేశమునకు పడమటిదేశముల ద్వారాతేబడినదో అట్లేనిదియు తేబడినది. ఇదియితర అన్నివస్తువులకంటె ప్రాణాపాయకరమైనది. యిదిత్రాగుడుకంటె యెక్కువగా మనుష్యుని పీడించును. కొకేన్ పుచ్చుకొనిన తోడనే బడలికతీరి సంతోషము నిచ్చినట్లుండును, తుదకది మనస్సును, దేహమును, కడపటిగా ఆత్మనుకూడా పాడుచేయును, మనహిందూ దేశములో తాంబూలము వాడుచున్నట్లు యిరోపా, అమెరికా దేశములలో దీనిని వాడుకొనిరి. ఇది దేహములోనికి

ఇంజెక్షన్ చేయబడును. ఈ యలవాటు మొదట మాంఘిర్ అను పట్టణమునుండి కలకత్తాకు 1904-వ సం॥ తేబడెను. బహుస్వల్ప కాలములోనే యీయలవాటు దేశమందంతట వ్యాపించుటచే పాలకులు దీనిని అమ్ము అధికారముపొందని వారెవ్వరును దీనినమ్మకూడదని యేర్పరచిరి. దానికి దాసులగు వారిలో ముఖ్యులు పందలాది పిల్లలై యున్నారు. 1904-వ సం॥ లో మనహిందూదేశములోనున్న ప్రజలందరికి ఒక్కసారిగా విషముపెట్ట గలిగిన ఒక లక్షరూపాయల ఖరీదు చేయు కొకేన్ యొకపడవనిండా యింగ్లాండునుండి కలకత్తాకువచ్చెను. అప్పటిలో మనదేశములో పన్నువసూలు చేయు సంఘమువారు తమలోతమకు పొసగకయున్నందున అదృష్టవశాత్తుగా ఆపడవనట్లేయింగ్లాండు దేశమునకు తిరుగగొట్టిరి. ఈ సంగతిహిందూదేశమున కంతటికొరకు జరిగిననాల్గవ మితానుభవ కూటమునకగ్రాసనాధిపతిగానుండి యుపన్యసించిన నరేంద్రనాత్ సన్‌గారి వలన చెప్పబడినట్లు "హింధూదేశములోనున్న మితానుభవము" అనుపుస్తకములో 45, 46 పుటలయందు కనబడును.

భంగు, గంజాయి, హాషిష్ అను ఆకుదినుసుల ఉపయోగములవలన మరియెక్కువనష్టము గలిగెను. వీనివలన గలుగు నష్టము తలపిచ్చియెక్కజేయును. ఇట్టిమూలికలవలననే పిచ్చివారి వైద్యశాలలలోనున్న యనేకులు తమజ్ఞానమంతయు పోగొట్టుకొనిరి, దేశములన్నిటిలో వెనుక బడియున్న తుర్కీరాజ్యము సహా హాషిష్ అను మూలికను నిషేధించుచున్నది" అనిమహా ఘనులగు సామ్యుల్, స్మిత్. ఎం. పి. గారు చెప్పిరి. దీనిని రచించినవారు బంగాళములోనుండు తమ స్వదేశీయులకు దుర్గపూజ చేయుకాలములో చివరిదినమగు విజయదశమినాడు ఆకుదినుసులతో తయారుచేయబడిన భంగను మత్తుద్రవ్యమును పూజకాలములో నుపయోగించిరని చెప్పుట కెంతయు విచారపడుచున్నారు.

గ్రంధకర్త హిందూదేశములో వనవాసులగు సన్యాసులలో ననేకులు గంజాయి నుపయోగించుచున్నారని చెప్పుటకు మనస్సుకు



నొప్పి కలుగుచున్నదని వ్రాసెను. గంజాయి త్రాగుటవలన వారికంట్లెర్రబడియుండుట చూడవచ్చును. గంజాయిత్రాగుట కుపయోగించు చిలుములేని సన్యాసులు బహు అరుదుగా నగపడుదురు.

## కొకేన్ ఉపయోగించుటవలన కలుగు ఫలితము.

కొకేన్ ఉపయోగించువారు బహుభయంకరమగు అనుభవము కలిగియుందురు దానివలనకలుగు అప్పటి కప్పటికులాస దానినుపయోగించినవానిని స్వర్గమందుండినట్లు చేసినను వానికి తరువాత గలుగు యమభాధ చాలాభయంకరముగానుండును. వానికి భయమును భ్రీమయును యెల్లప్పుడుండును, వానికి నిద్రలేమి, నరములు, కడుపు మొదలగునవి నొప్పులు కలిగియుండును. అజీర్ణము, ఎల్లప్పుడుగుండెదడ గలిగి చివరకు నశించును. వాడు చూపుకు తనకేగాక యితరులకును భయంకరముగానుండును. వాడు బ్రతికియుండియు చచ్చినవాడే. ఇదియంతయువాడు స్పష్టముగా యెరిగియుండినను వీనివలన కలుగు సంతోషము కొంచెము కాలమైనను దానిననుభవించవలెనని పరుగెత్తును.

## నల్లమందు.

"నల్లమందువలన బాధకొంచెము నిమ్మళించినను నొప్పికిగల కారణము అదిబొత్తుగా తీసివేయదు. ఇదిమెదడును మొద్దుపరచి జ్ఞానతంతువులద్వారా యేసమాచారమును తెలుసుకొనలేకుండ జేయును. మెదడిట్టిస్థితిలో నున్నప్పుడు వినికిడి, రుచి, చూపుకూడా తగ్గును. నల్లమందుయొక్క మత్తునుండి యొకనిదేహము విడిపింప బడగానే యీ విషమువలన దేహమందలి బలహీనత యెక్కువై యిదివరకు మెదడుతో నేమిసంబంధము లేకుండనున్న జ్ఞాననాడులన్నియు అప్పుడు చాలకష్టపడును" దీనికి కారణము యీ విషము మొదట తీసికొనునపుడు దేహముపొందు అనవసరపుశ్రమయే అని యేల్ కళాశాల

యందు ఆర్థికశాస్త్రపండితులగు అర్వింగ్ ఫిషర్ వైద్యులును ఆరోగ్యశాస్త్రప్రవీణులునగు యూజీన్ లైమాన్‌ఫిస్క్. ఎం. డి. గార్లచే (యు. ఎస్. ఎ) రచియించబడిన "ఎట్లుబ్రతుకవలెను" అనుపుస్తకములోనుండి ఎత్తివ్రాయబడినది. ప్రస్తుతము వైద్యశాలలలో వాడుకచేయబడు కొన్ని ఔషధములలో నల్లమందు (సారాయి, ఔషధమును) కలియుటచే అట్టిమందులు పుచ్చుకొనుటవలన నల్లమందు అలవాటుకూడా అబ్బును. అనేకులగు వైద్యులుకూడా రోగమునుబట్టి ఔషధములు వ్రాయునపుడు నల్లమందు, సారాయి, మొదలగువాని యలవాటును దెచ్చుమందులను సహా వ్రాయుదురు.

## నల్లమందువలన కలిగెడునష్టము.

1. నల్లమందుపయోగమువలన అజీర్ణమేర్పడును.
2. నల్లమందువలన మలబద్ధము కలుగును.
3. ఉచ్ఛ్వాసనిశ్వాసములు సరిగా నుండకపోవును.
4. సూక్ష్మబుద్ధిచెడి మందగించును.
5. నరములను బలహీనపరచును.
6. దగ్గిరబంధువైనను ప్రేమలేకుండా జేయును.
7. దానినుపయోగించువాడు స్వార్థప్రియుడగును. నల్లమందును ఐరోపా, అమెరికాలలో మనుష్యులనరములలోనికి సూదులద్వారా (ఇంజెక్షన్) నెక్కించబడినట్లు వారిదేహములమీద మచ్చలద్వారా కనుగొనవచ్చును. హిందూదేశములో దీనినిమాత్రలుచేసి మ్రింగుదురు. ఇదిత్వరగా దేహమందుపనిచేయుటకై నీళ్లలోగలిపిత్రాగుదురు.

ఈ పుస్తకము వ్రాసినగ్రంధకర్త తమవైద్య మతప్రచారకార్యములలోను నల్లమందుపయోగించువారితో కలిసి మెలసి యుండినందున దానియందు మంచి అనుభవము కలిగియున్నారు. హిందూదేశస్థులనేకులు పిల్లలుపెరిగి వృద్ధులైనప్పుడు కలుగు విపరీతపురోగములనాపుటకై చిన్నతనమునుండియే నల్లమందు వాడుకచేయవలయునని



సలహానిచ్చిరనుట కెంతయువిచారకరము. అతిమూత్రపురోగముగలవారికి నల్లమందుపయోగించిన యెడలబాగుపడుదురని సలహానిచ్చిరి. ఇట్లనేకులు దీనిని ఔషధముగా పుచ్చుకొన్నందున వీరు తమబ్రతుకుకాలమందంతటియందును యీ హానికరమును, ఆరోగ్యమును పాడుచేయునలవాటుకులోనైయుంటున్నారు. నల్లమందువలన గొప్పశాంతి కలిగినట్లుండినను తరువాతకలుగు యుపద్రవము చాలాగొప్పదైయుండును. ఒకమనుష్యుని నొసటిమీద వ్రాలినదోమ నొకదానిని కర్రతో బాదవచ్చునుగాని అట్లుబాదుటచే మనుష్యునికూడా చంపవచ్చును.

## చీనావారిమార్గదర్శకత్వము.

చీనాదేశములో మొదట గసగసాలు పైరుచేయబడినప్పుడు దానివలన వచ్చునల్లమందు కలుగజేయు ఉల్లాసమునుబట్టి యాచెట్టు "దైవసంబంధమగు మొక్క" యనిపిలిచిరి. గాని నల్లమందు యలవాటు లోకమందంతట వ్యాపించి, దానివలన వచ్చుకీడు తేటగా తెలిసినతర్వాత, దానిమీదసాలుకువచ్చు 10 కోట్ల రూపాయలు దానియలవాటుతప్పించుటకై ఖర్చుపెట్టెదమనిరి. నల్లమందువ్యాపారమునాపుటకై యనేక ప్రయత్నములుచేయు చీనావారు గౌరవార్హులై యున్నారు. చీనారాజ్య పరిపాలకులు నల్లమందు వ్యాపారము నాపుటకై పెకిన్ అనుముఖ్యపట్టణములో రాజశాసనము వెలువడించినపుడు జనులువేలకొలది నల్లమందుగుండ్లను వానినుపయోగించు గొట్టములను తగులబెట్టిరి. "పాతశాలలుమూయబడెను. విద్యార్థులొకే తరహాబట్టలను ధరించి నల్లమందు నాపుటకై ప్రయత్నించు సంఘము కూడుకొను స్థలమునకు నడచి ఆటపాటలు జరిపిరి."

బర్మాదేశము తరువాత అస్సాము, చిటగాంగ్ ప్రదేశములలో నీయలవాటెక్కువగా నున్నది. ఈ యలవాటు ఒరిస్సాలోకూడా వ్యాపించెను గంజాయి, నల్లమందు (Extract of Opium) సత్తు, (or Morphine) కొకేన్ అను నీమూడు బర్మాదేశములో ప్రస్తుతము వాడుకలోనున్నవి. బర్మాదేశములోని కొన్ని జిల్లాలలో కొకేన్ బహువిస్తారముగా వాడబడుచున్నది."

# తమలపాకు—పోకచెక్క.

## 4. అధ్యాయము.

**హిందూదేశమందున్న** వేర్వేరు భాషలలో తమలపాకు వేరువేరు విధముల పేర్లతో పిలువబడుచున్నవి.

సంస్కృతము :—**తాంబూలీ**, నాగబల్లీచ, నాగనీ, నాగబల్లిక, విబబీష్టు, పర్ణలత, నాగబల్లరి.

బంగాళీ :—**తాంబూల్**, పాన్.

హిందీ :—నాగర్ బెల్ల.

అరవము :—వెట్టిలేయ్.

**తెలుగు** :—తమలపాకు.

మహారాష్ట్రము :—పాన్, నాగ్బెల్.

**గుజరాతి** :—పాన్, నగర్బెల్.

లతీను :—పైపర్ బిటెల్.

ఇంగ్లీషు :—బిటెల్ లీఫ్.

" బరూయి " అనునొక విధమగు కోమటిజాతివారికి తమలపాకు పండించుటయే నొక వృత్తియైయున్నది.

చునార్ ప్రదేశమందు పైరగు తమలపాకులు హిందూదేశమంతటిలో ప్రసిద్ధికెక్కినవి. ఇవి హిందువుల పుణ్యక్షేత్రమగు కాశీకి విస్తారముగా నెగుమతి చేయబడును. తాంబూలమన్న హిందువులకు బహుఅపేక్ష. వీనిని దైవపూజ, పండుగ, కూటములు, విందులు, మందులకేగాక భోజనమైన పిదపవాడుదురు. మొత్తముమీద దీనినెల్లప్పుడు వాడుచునేయున్నారు.

## తాంబూలమువర్జించ వలయునని హిందూ శాస్త్రములు చెప్పుచున్నవి.

**హిందువులపద్ధతి** చొప్పున ఔషధముల నుపయోగమును గూర్చిన ఆయుర్వేదశాస్త్రము యిట్లుచెప్పుచున్నది.

1. " తాంబూలాం కామత్సేపనం " అనగా తాంబూలము వేయుట వలన మనుష్యులు పశుప్రాయులగుదురు.

2. " **తాంబూలాత్యప** జగశ్చాయత్ శోషపిత్తనిలాశ్రిత దేహాద్రిక్ కేశదంతాగ్ని శ్రోత్ర బర్న బాలతుాయ " దీని కర్థమేమనగా " తాంబూలము అమితముగా నుపయోగించిన దేహమునందు బలము, కండ్లు, వెంట్రుకలు, దంతములు, చెవులు వీటిశక్తికూడా తగ్గును."

## తాంబూలమునందలి మిశ్రమములు.

హిందూదేశస్థులు వాడుకొను తాంబూలములో తమలపాకు దీనిపై వ్రాయుటకు మెత్తనినీరుసున్నమును, లవంగచూరును (వక్కపొడి) ధనియాలును, కాచును ఆకుమీదచల్లి అంతయుకావలసిన రూపమునకు మడుచుకొని నములుదురు. ఇదిసాధారణమైన విధము. వీనితో శెకచూపబడిన పెటపెటలాడుపొగాకు, దాల్చినిచెక్క, ఏలకులు, లవంగాలు కూడాకలుపుదురు. పొగాకుపొడిని ముఖ్యముగా ఒరిస్సాదేశస్థులు తాంబూలములో వాడుదురు. గొప్పవారిలో ననేకులు దాల్చినిచెక్క, లవంగాలు, ఏలకులుగాక సువాసన ద్రవ్యములు వేసితయారుచేసిన సుర్టి, జార్డ అను పొగాకు మిశ్రమములుకూడా తాంబూలములో వాడుదురు. ఈ సుర్టి, జార్డ అను పొగాకుతో తయారుచేయబడిన వానిని బంగాళీలు శ్రమపడి ఉత్తర హిందూస్థానమునుండి తెప్పించుకొందురు. కొంతమంది తాంబూలము (కెల్లీలు) తయారుచేయువారు కొకేన్ కూడా దీనిలో కలుపుచున్నారు.

హిందూ (సంస్కృత) ఆయుర్వేద (వైద్య) శాస్త్రము యీక్రింది సమయములలో తాంబూలము వర్జించవలయునని చెప్పుచున్నది:—

"తాంబూలమహితాంగ్ ప్రోక్తాంగ్, శరీరేరతదుర్బలే జారష్య శోషపిత్తసారముద మూరేఃతూహిరోగిషు," అనగా జ్వరము గలిగియున్నప్పుడును, నోరు యెండియున్నప్పుడును, పిత్తము చెడుటవలన రక్తప్రవాహము సరిగానుండ నప్పుడును, ఆయాసము గలిగియున్నప్పుడును, కండ్లుజబ్బుగానున్నప్పుడును, కోపముగలిగియున్నప్పుడును, బలహీనులకును, తాంబూలము అపథ్యమైనది."

# తాంబూలమువలన నష్టములు.

ఈక్రింది విషయములు వైద్యుడగు మోతుద చరాన్ భట్టచార్య గారిచే రచింపబడిన 1323 సం. 12 సంపుట "స్వాస్థ్యసమాచార" అనుపుస్తకమునుండి గైకొనబడినవి.

1. "తాంబూలము మత్తును, మలబద్ధమును కలుగజేయును" 367 పుట.

2. "పొడిచేయబడిన తాంబూలము అర్ధాయుస్సును గలుగజేయును" 368 పుట.

3. "విశేషముగా తాంబూలము సేవించువారు త్వరలో వృద్ధులగుటయు, దంతములూడికపోవుటయు సంభవించును" 369 పుట.

4. "అధిక తాంబూల సేవవలన ఆకలి చచ్చిపోవును" 369 పుట.

5. "తుదకు అట్టివారికి అజీర్ణరోగము రక్తవిరేచనము గ్రహణియివి సంభవించును" 369 పుట.

6. "తాంబూలము యెల్లప్పుడుపయోగించుచుండిన యెడలబుద్ధిమాంద్యము గలుగును. తలవెంట్రుకలు నెరయును." 369 పుట.

7. "తాంబూలము విశేషము వేయుచుండిన పండ్లు త్వరలో నూడిపోవును." అని డాక్టరు రామ్ చరాన్ రాయ్‌గారు ఫాల్గుణ మాసం 1326 సం॥. "స్వాస్థ్యసమాచార" అను పత్రికలో వ్రాసిరి.



8. "తాంబూలము పండ్లకు గేరపట్టించును జీర్ణశక్తియు తగ్గించును" అని వైద్యుడు కార్తిక్ చంద్రబోస్ ఎం. బి. గారువ్రాసిన "స్వాస్థ్యనీతి" యనుపుస్తకములో 17-వ పుటలోనున్నది.

9. "ఆకులో ఫేరిన్ అను పదార్థమున్ను, అరికేడిన్, ఆర్కొలిన్ అనునవి వక్కలోనున్నవి" డాక్టరు వి. ఎల్. మాన్. ఎం. డి. "గారు 1917-సం॥ ఏప్రల్ నెల "హెరల్డ్ ఆఫ్ హెల్త్" అనుపత్రికలో వ్రాసిరి.

10. "తాంబూలములో వేసికొనుసున్నము నోటిలోను, పొట్టలోనుండే సన్ననిపొరను తినివేయును, సున్న మెక్కువగా నుపయోగించిన నోరుపొక్కి మంటపుట్టును."

11. "పోకచెక్కలో మత్తుకలిగించు గుణమున్నది" తాంబూలములో ఎండినవక్కలనే యుపయోగించెదరు. పచ్చివిగానున్నప్పుడు పయోగించినయెడల తలత్రిప్పుపుట్టించును.

12. "తాంబూలము మూర్ఖమైన కోపముగలిగించును" పవిత్రమగు హిందూశాస్త్రమగు బ్రంహబాయ్ బోర్తా పురాణమిట్లు చెప్పుచున్నది.

"తాంబూలా బిధబస్త్రీణాం జాతినాం బ్రంహచారినాం
తపస్వినాశ్చబిపేంద్ర గోమాంశ్గసాదృషాం దృభమ్"

దీనికర్థము. "విధవరాలికి గాని, ఈశ్వరపూజచేయు నొకబ్రంహ్మచారికిగాని, సన్యాసికిగాని, తాంబూలము గోమాంసమువంటిది" అనగా పవిత్రమైన గోవుయొక్క మాంసము దినుట హిందువుని కెంత పాపమో, తాంబూలము వేయుటంతపాపము.

13. "కాచు దేహమును బిగించి, నోరు, కడుపు, పేగులు, వీటి నెండజేయును."

14. "తాంబూలము వేయువానినోటికి రుచితెలియకపోవును.

15. "తాంబూలము వేయుటవలన ఎక్కువగానుమ్మి వేయుదురు. అట్టియుమ్మి కేకరింపులతో వచ్చునదై యుంటున్నది. జీర్ణశక్తికవసరమగు నీయుమ్మినిట్లువ్యర్థపర్చుటచేత జీర్ణశక్తియుతగ్గుటగలదు."

16. తాంబూలము సేవించుటవలన గలుగు నష్టముల వివరించ నీపుస్తకము చాలకపోయినను రెండుదహరణములు మాత్రమిచ్చుట కుదహరించబడినవి.

(1) "నాబంధువులలో నొకరు దినమున కర్థపావు (నవటాకు) వక్కలు నములుచుండును. అందువలన నామె బుద్ధివికాసమునానాటికి తగ్గి ముప్పదియేండ్లవయస్సునందే వృద్ధురాలవలె నగపడెను. గతసంవత్సరమునుండి యామెచటాకువక్క వేళ్లేదినుచుండు నట్లేర్పరచుకొన్నందున గతించిన సూక్ష్మబుద్ధిమరల రానారంభమై యవ్వనురాలగుచుండెను" అని వైద్యుడగు మోక్షధచరాన్ భట్టచార్జిగారు "స్వాస్థ్య సమాచార" యనుపుస్తకములో "తాంబూలము"ను గూర్చిన విషయములో వ్రాసిరి.

(2) ఈక్రిందిసంగతి 1920-సం॥ జూలై నెల 23-తేది ప్రచురింపబడిన "ది స్టేట్సుమన్" అనుపత్రికలో కనుగొనబడినది.

## "ఒక హిందూచిన్నవాని మరణము."

## "ఒక పటాలపు ఉత్తరక్రియ"

"ఇంగ్లాండులోని సాండ్‌హర్ట్సనందలి (రాయల్ మిలిటరికాలేజి) రాజభటులను తర్బీతుచేయు విద్యాలయమందు చదువుచున్న ఇక్బల్ అలిబేగ్ అనుచిన్నవాడు అచ్చటి శరణాలయములో చనిపోయినందున అతని మరణమునుగూర్చి విచారణ చేయుటకై యొకసభ గూడెను.

"ఈచిన్నవాడు హైదరాబాదు నవాబుయొక్క సేనాధిపతియగు కర్నల్ సర్ మొహమ్మదు అలిబేగ్‌గారి కుమారుడైనట్టు యిది



వరలో నానవాబువద్ద ప్రధాన మంత్రిగానుండి యిప్పుడింగ్లండునందున్న నవాబ్ సాలర్ జంగ్‌గారివలన గుర్తుపట్టపడెను."

"హార్లిస్ట్రీటునందున్న ఆర్. ఎ. యంగ్. అనువైద్యుడు వానిశరీరము యక్స్‌రేస్‌సహాయమున పరీక్షించునప్పుడు ఆ చిన్నవాడు ఊపిరించలేకపోవుచున్నాడనియు; వానియొక్క కుడిరొమ్ములో పోకచెక్కతినియున్న చిహ్నములగుపడెననియు చెప్పెను. నిపుణులగు వైద్యులు విచారించి పోకబద్దయందలి కొన్ని భాగముతీసిరి. వానిచే నతడు మిక్కిలి దుర్బలుడైనట్టును, వానికార్జమునందొక పుండున్నట్టును తెలియబడెను. గురువారమునాడు అతడు చనిపోయెను; మరణమునకు కార్ణము వక్కను సదా నములుచున్నందున కార్జములో నొకపుండుపుట్టి........వ్యాధివృద్ధిజెందుటయే."



# వనమూలికలును—సిద్ధౌషధములును.

## 5. అధ్యాయము.

"మూలికలను ఔషధముగానుపయోగించుట చాలహానికరము".
ప్రస్తుతమందు మూలికలయుపయోగము హెచ్చుచుండుటచూడగా కొద్దికాలమునుండి నానావిధ రోగములు ప్రబలుచుండినట్లు తెలియుచున్నది.

ఇటీవల "గుడ్ హెల్త" ను పత్రికాధిపతియగు జాన్‌హార్వి కెల్లాగ్. ఎం. డి. ఎల్. ఎల్. డి. యను నమెరికా దేశస్థుడిట్లువ్రాసెను. "మూలికలయుపయోగమునకు దోడుగా మధుసారము, నల్లమందు (అభిని) పొగాకు అను వీని యుపయోగమునున్న జేర్చి చూచినయెడల మొత్తము మీాద గత 50 సంవత్సరములలో పిచ్చివారేమి మూర్ఛగలవారేమి మూడురెట్లు అధికమైరి.

సాధార్ణముగా ప్రచురింపబడు మూలికలు వ్యాధిని ఉపశమింపజేయునవియైనను కొన్ని ప్రస్తుతము రోగముయొక్క భాధను తగ్గించునుగానిదానిని పూర్తిగా మాన్పలేవు. కొన్ని మూలికలు రోగాంకురములను నాశనముజేయును. కొన్ని పదార్థములను కుళ్లకుండజేయును మరికొన్ని విషములకు విరుగుడైయుంటున్నవి.

శాస్త్రమందును, వైద్యమందును నిపుణుడును, సుమారు 80 సం॥ వరకు అమెరికాలోని హార్వార్డ్ వైద్య పాఠశాలయందు పనిచేసిన వైద్యుడగు ఆలివర్ వెండల్ హామ్సుయనునాయన యొకసారి ఉపన్యసించుచు మూలికలన్నియు సముద్రములో వేయబడిన యెడల మనుష్యులకు మేలుకరమేగాని చేపలకు హానికరమని చెప్పెను. మరియు మూలికయేవిధమగు నుపయోగము నిచ్చినను దాని ముఖ్యగుణము



హానికలిగించుటయేయనియు చెప్పెను. ఒకవేళ దానివలన కలుగుకీడు అదిచేయుమేలుకు సరిపోవునాయను సందేహముగలుగును.

## మరుగుపరచబడిన అమితత్వము.

చంటిబిడ్డలకు పసితనమందివ్వబడిన పేటెంటు మందువలనవారు పెరిగినపిమ్మటమితత్వపు విత్తనములు గలిగియుందురు. ఇదివరలో హిన్స్‌డేల్ సానిటేరియమ్ (ఆరోగ్యాశ్రమము)నకు పెద్దగాను, సిగరెట్టుయలవాటు నాపుటకై ప్రయత్నించు సభకు అగ్రాసనాధిపతిగానున్న డేవిడ్. పాల్‌సన్. ఎం. డి. యనునమెరికా వైద్యుడు "అందరువాడుచుండెడి సూదింగ్ షర్బత్, హేరడ్ అనువానిచే చంపబడిన బిడ్డలకంటె ఎక్కువ సంఖ్యనుచంపియున్నది. ఎట్లనగా అది తయారుచేయబడుమూలికలలో ప్రతిరెండు ఔన్సులలో నొకగింజయెత్తు నల్లమందుతో సమానమగు మార్ఫిన్ అనుపదార్థమున్నది" అని చెప్పిరి.

న్యూయార్క్ పట్టణమందలి పాలిక్లినిక్ మెడికల్‌స్కూల్ అను హాస్పిటల్ డాక్టర్ యి. మేధర్ సిల్. గారిచ్చిన యుపన్యాసములలో "చంటిపిల్లలను కాపాడు దాదులుగాని, తల్లులుగాని బిడ్డలకు దగ్గు, నీళ్లవిరేచనములు కలిగినప్పుడిచ్చు సిద్ధౌషధములు, తేయాకునీళ్లు, యింకయితరములగు బలకారులగు వానిలో నల్లమందు, మధుసారము మొదలగు విషపదార్థములున్నవని తెలియకయే వాడుచుందురు" అని యన్నట్లు తెలుసుకొనగలము.

## తలనొప్పిమందు.

అనేక వార్తాపత్రికలలో తలనొప్పిమందునుగూర్చి ప్రచురింపబడియుండుట చూడవచ్చును. అట్టియౌషధములు నిజముగా తలనొప్పిని తీసివేయవుగాని, తలనొప్పిని కనుగొనగలుగు జ్ఞానేంద్రియములను మొద్దుపరచుటచే తలనొప్పి పోయినట్లుండునుగాని నిజముగా తలనొప్పితగ్గజేతగదు. తలనొప్పికి వాడబడు బిళ్లలలో ఫెనేసిటిన్, కాఫిన్ అను మత్తుపదార్థములుగలవు. ఫెనేసిటిన్ అనునది గుండెపనినాటంక

పరుచును. దీనిగ్రంథకర్తలిదివరలో కలకత్తాయందలి యొకవైద్యశాలలో పనిచేసియుండిరి. అప్పుడు తలనొప్పిమందు బిళ్లలవలన గలిగిన యొకవిపత్తును చూచియుండిరి. ఆవైద్యశాలలోనిదివరకే ప్రసవమగుటకు వచ్చియుండిన యొక దొరసాని సుఖముగానుండినందున యొక దినము ఆమెను, బిడ్డను ఆమెభర్తయింటికి తీసికొనివెళ్లనై యుంచెను. ఆదినమందే ఆమెకు కొంచెము తలనొప్పిగా నున్నందున, ఆవైద్యశాలలో నెవ్వరికెరుకలేకుండా తన ఆయానుపంపి కొన్ని తలనొప్పిమందు బిళ్లలను తెప్పించుకొని, నొప్పిత్వరగా పోవలెనన్న యాతురతతో నెక్కువ బిళ్లలను తినినందున భర్తవచ్చు సరికి చనిపోయి యుండెను.

తలనొప్పి యొక రోగముగాదుగాని, రోగము వచ్చుటకుముందు సూచనయే. తలనొప్పికి యనేకకార్ణములుండవచ్చును. కండ్లవలనవచ్చు తలనొప్పి చక్కగా నమర్చబడిన అద్దములజోడువేయుటచే పోవును. పేగులయందుగాని, అన్నకోశమందుగాని జఠరాగ్ని లేనియెడల తలనొప్పిగలుగవచ్చును. లేదాయేదో యొక జబ్బువచ్చుటకు ముందుగా తలనొప్పిరావచ్చును. తలనొప్పివచ్చుటకు ముఖ్యకార్ణమును కనుగొని దానిని తీసివేయుటయే నొప్పిపోవుట. కాబట్టి, ఆస్పిరిన్, ఫెనేసిటిన్ మొదలగుపదార్థములు కలసియుండు ఔషధములను ముట్టకుండుటయేముఖ్యము.

## మూలికలయందలి దుర్గుణములనుగూర్చి ఘనవైద్యుల అభిప్రాయము.

ప్రస్తుతమందలి వైద్యులకు మూలికలయందలి నమ్మకము రాను రాను తగ్గుచున్నది. వైద్యశాస్త్రమును చదువు విద్యార్థుల ముఖ్యపాఠపుస్తకమగు ‘ ఔషధములను వాడుకచేయువిధము ’ అనుపుస్తకమును రచించిన సర్. విలియం ఆస్లర్ అనునాయన “ మూలికలవలన నుపయోగములేదని తెలిసికొనిన వైద్యుడే గొప్పవైద్యుడ”నివ్రాసెను.



గతించిన ఎడ్వర్డుచక్రవర్తిగారికి వైద్యులుగానున్న సర్. ఫ్రెడరిక్. ట్రీవ్సగారు “ ప్రజలు జబ్బుగానున్నప్పుడు అమితముగా మందులుపయోగించుట ఎప్పుడు చాలించుకొందురాయని కనిపెట్టుచూచుచుంటిన”ని చెప్పిరి.

ఇంగ్లాండు, ఆస్ట్రేలియా, అమెరికా యీమూడు దేశములందుపయోగింపబడు ఔషధములయందు అనుభవముగలిగిన డాక్టర్. డానియల్ క్రెస్. ఎం. డి. గారు. సిద్ధౌషధములలో నల్లమందు వాడుకనుగూర్చి “ అమెరికాదేశస్థులమగుమేము, నల్లమందును దానికిసంబంధించినవానిని చీనాదేశస్థులకంటె నమితముగా వాడుచున్నాము. హీరోన్ అనునల్లమందుకు సమానమగు మార్ఫిన్ ప్రస్తుతమందలి పేటెంటు యవుషధములనేకములలో వాడుదుము. దీనితోసమానమగు లాడనమ్ అను పదార్థముగూడ ననేకౌషధములలో వాడబడుచున్నది. నరములనొప్పులకు, కడుపునొప్పులకు ప్రచురింపబడు యవుషధములలో కొకేన్ సర్వసాధార్ణముగా వాడబడుచున్నది ” అని చెప్పియుండిరి.

## మూలికలు మోసకరమైనవి.

“ మూలికలు రోగములను బాగుచేయవు ” గానిరోగములధోరణినిమార్చును. మనమేదైన యొక అవుషధము పుచ్చుకొనునప్పుడు దానియందు కలియు మూలికల ముఖ్యగుణమేమియనినైయైన, లేదా ఆయౌషధములో నేమేమిచేరుననియైన కనుగొనకుండ పుచ్చుకొనుట గొప్పపొరబాటు. అనేకపల్లెలయందు వైద్యశాస్త్రమెరుగని వైద్యులు వాడు రసమందులుతిని తమపండ్లూడుటకు సిద్ధముగానున్న రోగులనేకులు వైద్యశాలలకు పోవుట చూచియుంటినని గ్రంథకర్తగారు చెప్పుచున్నారు.

## మూలికలయుపయోగము.

"మూలికలు రోగములను బాగుచేయ జాలవని ప్రజలందరి కెరుకచేయవలెను. మూలికలు అప్పుడప్పుడు కొంచెము రోగనివారణకలిగించుననుట నిజమే. వానినుపయోగించుటచే రోగి అప్పటికప్పుడే బాగుపడినట్లుండును. యేలననగా రోగములకుగల కారణములనుకనుగొని, వానిలోనుండెడు విషములను వెడలగొట్టుశక్తి మనదేహమునకే యున్నట్లు సృష్టి చెప్పుచున్నది: కాబట్టి మూలికలుపయోగించిన, చెడినదేహారోగ్యము మరలకుదురవచ్చునుగాని యనేక దృష్టాంతములలో మూలికలు ఒకరోగమును మరొకదానిగామార్చి, మొదటిస్థలమునువదలి మరియొకస్థలమందా రోగమును ఆరంభించును. గనుకనేమూలికలుపయోగించినప్పుడు రోగముపోయినట్లుండునేగాని; ఆవిషము దేహములోనుండి తరువాత దేహమునకు చాలహానిచేయును.

విషములుపయోగించినందు ననేకులు తమమరణ పర్యంతము తమనువిడువని యనేకరోగములను తెచ్చిపెట్టుకొందురు.

నిర్మలమైనగాలి, వెలుగులోనుండుట యేవిధమగుమత్తు పదార్థములంటకుండుట, విశ్రాంతి, పరిశ్రమ, మంచియాహారము, నిర్మలమైననీరు, అన్నిటికిపైగా దైవకృప, యివియేరోగముల్ల పోగొట్టునవి" యనిసుప్రసిద్ధములగు కొన్నిసిద్ధాంతములు చెప్పుచున్నవి.

సంయుక్తరాష్ట్రములలో "మార్ లాడ్జ్" యనుపేరుగల మస్సోరీసానిటోరియ మందును సిమ్లాలోని "బెల్ విడర్" అనుపేరుగల సిమ్లాహైడ్రోల్ అనుచోటునందును, రోగులకు విషసంబంధములగు మూలికలకు బదులుగా మంచినీరు విద్యుచ్ఛక్తి నుపయోగించి రోగములు బాగుచేయుటజూచిన రోగములకు మూలికలయుపయోగమనవసరమని హిందూదేశమందలి ప్రజలకు బాగుగా తెలియగలదు.

# రోగములును—రోగాంకురములగు చిన్నపురుగులును.

## 6. అధ్యాయము.

"బంగాళాదేశపు పులులకంటె రోగాంకురములగు క్రిములన్నను నాకెక్కువ భయము."

మితముతప్పి భుజించుటచేతను, సరియైన పరిశ్రమచేయక పోవుటచేతను, ప్రతివాడు తనస్వంత దేహారోగ్యము నిమిత్తమై తగిన శ్రద్ధపుచ్చుకొనుకుండుటచేతను ఒకని దేహమందలి సత్తువ తగ్గిపోవును. అట్టిసమయములో రోగమును ఎదిరించుశక్తి లేకపోవును. ఒకనికి జలుబుచేయుట యనగా నొకవిధమగురోగక్రిములు, దేహపటుత్వము తగ్గియుండుటచే, చేరియున్నవని గ్రహించవలెను.

గతకొన్ని సంవత్సరముల క్రిందట వేలకొలది హిందూదేశస్థులు మరణించుటకు కార్ణమగు ఇన్‌ఫ్లుయంజాయను వ్యాధియొక్క విధమగు క్రిమి వలనప్రబలినదై యున్నది. క్షయరోగులయొక్క యుమ్మియందనేక రోగక్రిములుండును. ఇట్లు లెక్కలేనిరోగములు అంకురములవలననే వ్యాపించుచుండును.

## రోగాంకురములెట్లువ్యాపించును.

రోగమును దెచ్చుసూక్ష్మాణువులు మనముతిని త్రాగెడిపదార్థములద్వారా దేహమందు ప్రవేశించును.

"ఇన్‌ఫ్లుయంజా, ఊపిరితిత్తులవాపు (Pneumonia) అను రోగములు పరస్పరసంబంధముగలిగినవే. ఇవి, సాధార్ణముగా తుమ్ము, దగ్గు, యుమ్మివేయుట, ముఖాముఖిగా నొకరొకరు మాట్లాడుట మొదలగు

వానివలన వ్యాపించును" అని "హౌ టు లివ్" అను పుస్తకము 375 పుటలోనున్నది.

ప్రతివారికి క్షౌరము చేయునప్పుడు సబ్బు వ్రాయుటకు మంగలి వాడుకచేయుకుంచె (Brush) ద్వారా యనేకరోగములు వ్యాపించును. గనుక ప్రతివారు క్షౌరము చేయించుకొనునప్పుడు మంగలవానికుంచె నుపయోగింపక స్వంతముగా కుంచెనొకదాని నుంచుకొని యుపయోగించుట మంచిది. అట్లే దువ్వెన మొదలగు ప్రతివస్తువువలన అంకురములు వ్యాపించును.

చాకలి యింటి నుండివచ్చు బట్టలలో సహా యంకురములుండి వ్యాపించును.

పొగబండ్లలోను, పొగయోడలలోను సోడా దుకాణములయందును ప్రయాణికులచే నుపయోగింపబడు పాత్రలద్వారాకూడ నిట్టి యంకురములు వ్యాపించును.

ఈగలు, ఎలుకలు, దోమలు మొదలగువాని ద్వారా అంకురములు వ్యాపించును.

పచ్చిపాలు, కాచియార్చనినీళ్లు త్రాగుటచేత వానిలోనుండు రోగాంకురముల వలనవ్యాధులు గల్గుచుండును.

సాధార్ణముగా మనయిండ్లలోనుండు యీగ విషజ్వరము, కలరా (వాంతిభేది) క్రిములను తెచ్చి మన యాహారపదార్థములమీద విడుచుటచే నవిమనదేహమందు ప్రవేశించును.

బొబ్బల తెగులు యెలుకలద్వారా వ్యాపించుచున్నదనుట యందరెరిగిన విషయమే.

అనొఫిల్సు అనునొకజాతిదోమ మన్యపుజ్వరాంకురములను ప్రబలింపజేయును.

మనమాఘ్రాణించు గాలిలోనుండు అణువులమీద బాక్టీరియా యను నొక జాతిక్రిమియుండుటచే మనము పీల్చుకొనునప్పుడది లోపలికిపోవును.



మనదేశమందలి చిన్న నాణెములను కుష్టుమేహవ్యాధులుగలవారు ముట్టుకొనినపిమ్మట యితరులు వానినిముట్టినయెడల అట్టివ్యాధులు వారికికూడా వ్యాపించుట సహజమే.

## అంటువ్యాధులుసోకకుండుట కేమిచేయవలెను.

ఆరోగ్యముగలిగి యున్నప్పుడును అన్నకోశము నిండుగానున్నప్పుడును, కొన్నివిధములగు రోగాంకురములగు క్రిములు దేహమందుచొరబడనేరవు. భోజనపువేళకుముందుగా నేవిధమగు అంటురోగముచే బాధపడురోగినైనను దర్శించుట క్షేమముగాదు.

మనమెట్టిరోగమునుండినైన తప్పించుకొనవలెనన్న ముఖ్యముగా సామాన్యమైన బ్రతుకుతో ఆరోగ్యముగలిగియు, అనావసరముగా దేహమలయజేయనివ్వకయు, నిద్రకొరత లేకుండుటయు, యింకాదేహపటుత్వముతగ్గించు నేవిధమైన వానికిలోబడకుండుట యవసరము.

వ్యాధిని గలిగించు యంకురము లెక్కువ వెలుతురుయందు జీవింపనేరవుగాని చీకటిగను, చెమ్మగనుండు గదులయందును, మురికికాలువలయొద్దను అపరిమితముగా నవిపెరుగగలవు. కాబట్టి చీకటి, చెమ్మ, దుర్వాసన గలిగిన యిండ్లలోను, మురుగుకాలువలకు దాపుగానుండు యిండ్లలోను నివసింపకుండుటయుక్తము. మననోటియందును ముక్కురంధ్రములందును వ్యాధిని దెచ్చుయంకురములుండునుగాని మనదేహముమంచి యారోగ్య స్థితియందున్నంత వరకా యంకురములేవ్యాధిని దేలేవు.





మనుష్యుడు ఈగను చంపవలయును లేదా యీగ మనుష్యుని చంపును.

# దోమలు—ఈగలు.

## 7. అధ్యాయము.

సూయజ్ కాలువను జయకరముగా త్రవ్వించిన ఫ్రెంచిదేశపు డి. లెసెప్స్ యను నాయన ప్రతిమయే పోర్ట్ సెడ్‌లో ఓడరేవునందు నిలుపబడియున్నది. పెనామా కాలువను త్రవ్వనుద్దేశించినప్పుడు ఫ్రెంచివారే యాపనిని జేయుటకు సంతోషముతో నొప్పుకొని, రెండు గొప్ప సముద్రభాగములను కలుపుట గొప్పకష్టమైన పనియైనను వెనుదీయక 1881-సం॥ మందు, పనినారంభించిరి. ఈ పెనామా యొద్దనున్న శీతోష్ణస్థితులు విష, మన్యపు జ్వరములదెచ్చు దోమలకు మంచివీలుగానుండెను. ఫ్రెంచివారు వానితో పోరాడనశక్తులైరి.

డి. లెసెప్స్‌గారు ఆస్థలమునకు మొదటవచ్చినప్పుడు ఫ్రెంచివారిలో మొత్తము మీదసంవత్సరమునకు జ్వరములవలన 8000 మంది మరణించుచున్నను, సంవత్సరమునకు 60 కోట్ల రూపాయలు ఖర్చు అగుచుండినను ఎనిమిది సంవత్సరములు కష్టపడి తుదకు పనివదలిరి.

తరువాత నచ్చట జరిగిన పనియందు జరిగిన విషయమే: సుమారు 20 సంవత్సరములు గడువకమును పే కర్నల్ గార్గాన్ యను నాయన, అమెరికా, ఐరోపా సైనికులతో వచ్చి నీకాలువను త్రవ్వ నేర్పరచుకొనెను. ఈయనగారు, ఫ్రెంచివారు వదలిన భాగమునుండియే పనినారంభించిరి. ఫ్రెంచివారు యీపనిని త్వరలో ముగించవలెనన్న యాతురతతో దోమలు నివాసమున్న కందకములు, గుంటల మధ్య తమపనివారల నివాసము లేర్పరచిరి. గాని గార్గాన్‌గారి మొట్టమొదట ప్రయత్నము తనపనివారలకు పూర్ణారోగ్యము గల్గునటుల జేయ ప్రయత్నించుటయే. కొద్దికాలములోనే పనివారలకొరకై దోమలుండ వీలుకాని శాస్త్రయుక్తమైన యిండ్లుకట్టించెను. గోతులు, కందకములు పూడ్పించెను. దగ్గిరగానున్న గుంటలలోని నీళ్లలో కిరసిన్‌నూనె చల్లించెను. అట్లు

దోమలను గెలుచుటయే యీపనియందు కృతార్థుడగుట యని యన వచ్చును.

ఇప్పటికిని, యిదివరకును మనదేశములో ననేకలక్షలకొలది జనులను దోమలు చంపుచున్నవి. ఎట్లనగా దోమలు, మన్యపు జ్వరముతో బడియున్న నొకని కరచినప్పుడు, వానిరక్తమునుండి క్రిములు దోమనోటియందు చొచ్చును. మరలా దోమమంచి యారోగ్యముగలవానిని కరచినప్పుడాయంకురములు వానిరక్తములో జేరును. “ఇట్లు మన్యపుజ్వరము మనుష్యునినుండి దోమలోనికిని, దోమలోనుండి మనుష్యునిలోనికిన్ని మార్చబడున”ని డాక్టర్. ఎఫ్. సి. రిచార్డ్స్, ఎల్. ఆర్. సి. పి. అండు ఎస్ (ఎడిన్) గారు చెప్పిరి.

పొడవు కాళ్లును, మచ్చలుగల రెక్కలుగల్గి చెమ్మనేలలో నివసించుదోమలేమన్యపు జ్వరమును దెచ్చునవి. సహజముగానీదోమలు ప్రొద్దుగ్రుంకినపిదపనే మనుష్యులను బాధించునుగాని, పగలు బాధించవు. అవి సాధారణముగా తమ నివాసములకు చుట్టునొక అరమైలు వరకే తిరుగును, మన్యపుజ్వరమును దెచ్చుదోమలు వానినివాసముల కుపైగా నెక్కువయెత్తునకుగూడ నెగురవు. ఏలననగా అవియుండు నివాసములు ఎక్కువపల్లపు స్థలములు. కాబట్టియే యిండ్లుకట్టువారు మిగులయెత్తైనస్థలముమీదను, కందకములు, మడుగులు, కాలువలువీనికి సుమారు అరమైలుదూరములోను కట్టుకొని అప్పుడప్పుడు నిలకడగా నుండు నీళ్లలో దోమలు పెట్టుగ్రుడ్లను చంపుటకై కిరసిన్ నూనెను చల్లుచూ, యింటిలో దోమ తెరలనుపయోగించుచుండిన యెడల యెట్టివారైనను మన్యపుజ్వరమునుండి తప్పించుకొన వచ్చును.

## ఈగ తననుగూర్చి చెప్పుకథ.

“ఈగను మనుష్యుడు చంపవలెను లేదా అది మనుష్యుని చంపును”.

“నేనొక యెరువు కుప్పలోపుట్టితిని. నాకుకోట్లకొలది అన్నదమ్ములును, అక్కచెల్లెండ్రునుగలరు. అందులో కొందరు మరుగుదొడ్లలోను, కొందరు మురుగు కాలువలలోను కొందరు కళ్ళెములు వేయుతొట్లలోను అట్టియితర స్థలములలోను జన్మించిరి నాకు......

......వారియింటిలో నివసించుట కిష్టములేదు. ఎందుకనగా ఆయన గారు దొడ్డిని, యింటిచుట్టుస్థలమును, వంటగది శుభ్రముగానుంచును మాకుమురికి యెక్కువయిష్టము. ఏమనగా మేము మురికిలోనే పుట్టి పెరిగితిమి. నేనుయేదైన నొక యింటిలో నుండవలనంటె.........

......గారియింటికి వెళ్లుట నాకిష్టము. ఏలననగా ఆయింటిచుట్టుప్రక్కల చెత్తచేదారము అధికముగానుండును. అందుమేము దాగొని యుండవచ్చును. ఆయింటి యజమానురాలు భోజనపదార్థములమీద మూతలేకుండనుంచును. నేనును నాలెక్కలేని బంధువులు అప్పుడు వెళ్లి ఆయా ఆహారముల మీద కూర్చుండి కడుపార భుజించెదము. అందుకు కృతజ్ఞతగా ఆయింటిచుట్టునున్న పెంటకుప్పలనుండి మా చిన్నిపాదములమీద మేముమోసికొనివచ్చిన నానావిధ రోగాంకురములను భోజనపదార్థములమీద వదలి వెళ్లెదము. ముఖ్యముగా, మామిడి, పనసపండ్ల కాలములో నేనునాబంధువులతోను, స్నేహితులతోను వచ్చి కప్పబడకయుండు తేనలమీదను, పండ్లమీదను వ్రాలి తృప్తిజెందెదము.

మేమొకయింటిలోనుంటిమి. అందొక విందుజరిగెను. మేమువెళ్లి చుట్టుప్రక్కలనున్న మాస్నేహితులనందరిని పిలుచుకొనివచ్చితిమి. మేము పిలువబడని అతిథులముగానున్నను పిలువబడిన వారివలెనే లోపలికివెళ్లితిమి. వచ్చినవారంతా తివాసీలమీద తమకాళ్లనుదులుపుకొని వెళ్లుచుండగా మేము వచ్చినపాటునే లోనికివెళ్లి ఫలహారముల మీదను యితర ఆహారపదార్థముల మీదను కాళ్లు పారచాచుకొని కూర్చుండి అవివడ్డింపబడకముందే మేము రుచిచూచితిమి.

కొన్నివారములైన తరువాత అక్కడకు వచ్చిపోయినవారిలో ననేకులు కలరావ్యాధివలన చనిపోయినట్లువింటిమి. వైద్యులు వారిమరణమునకు కారణము కనుగొన ప్రయత్నించినప్పుడు క్రిందటి విందులో

వడ్డించబడిన పదార్థముల మీదమేము కూర్చున్నప్పుడు విడచిన క్రిములవలన చనిపోయినట్లు తెలిసికొనిరి.

మేముచాలా చిన్న వారముగాను హానిచేయనివారముగానున్నను వివిధరోగములను వ్యాపింపజేసి వేలులక్షలకొలది మనుష్యులను సమాధికి పంపుటలో గొప్పవారము. మేము చిన్నవారమైనను మాలోకోట్లకొలది, యుద్ధమువలన గలుగు శ్రమకంటె యెక్కువశ్రమను కలిగించగలము" అని చెప్పెను.

## టైఫాయిడ్ జ్వరవ్యాపకము.

ఒకనికి టైఫాయిడ్ (కఫవాత) జ్వరమంటుకొనదుగాని వాడు దానిని మ్రింగును. ఈ వ్యాధి టైఫాయిడ్ బేసిలస్ అను క్రిమిమూలమున ప్రారంభమగుచున్నది. గనుక భోజనములద్వారాను, పానములద్వారాను యిది మ్రింగబడును. ఈగలు సహజముగా నిట్టివ్యాధిగ్రస్తుని దేహమునుండి వెడలు పదార్థములమీదవ్రాలి అట్టిక్రిములను తమతోకూడతీసికొని యితరస్థలములో పాలుగల పాత్ర మీదనో లేక యేదేని భోజనపదార్థము మీదనోవ్రాలుటచే నీవ్యాధిని తెచ్చుచున్నవి. అమెరికాదేశమందలి యునైటెడ్ స్టేట్సులో ప్రతిసంవత్సరము మూడులక్షల జనులు టైఫాయిడ్ జ్వరము వలననే మరణించుచున్నారు. ఈవ్యాధియెక్కువగా నీగలవలన వ్యాపించుచున్నది. ఎండాకాలపు వ్యాధియను నొక రోగముచే యునైటెడ్ స్టేట్సులో సంవత్సరమునకు నలుబదియెనిమిదివేల పసిబిడ్డలు నాశనమగుచున్నారు. ఇందుకు కార్యము యీగల వలన నీవ్యాధియొక్క సూక్ష్మజీవులు బిడ్డలకిచ్చుపాలలోనికి వ్యాపించుచున్నవి. హిందూదేశస్థితిచూచితే యిట్టిజబ్బులద్వారానేకమరణములు కలుగుచున్నవని చెప్పవచ్చును. స్పష్టముగా తెలిసికొనవలెనన్న దాఖలాలు దొరుకకున్నవి.



ఒక యీగగిన్నెడు పాలులో బడినయెడల లెక్కలేని జీవాణువులనందు వదలిపెట్టును. "ఒక్కయీగ ఆరువైలక్షల క్రిములను మోసికొని పోవునని కనుగొనబడెను" సాధారణముగా యిండ్లలో దిరుగు యీగలు దోమలకంటె యెక్కువహానికరములై యున్నవి.



## ఈగలవలన నీక్రిందివ్యాధులు వ్యాపించును.

| | |
|---|---|
| రొమ్ముపడిసెము | వాంతిభేది |
| అతిసారము | డిఫ్తేరియా |
| శీతభేధి | లారింజైటస్ |
| మెనింజైటిస్ | క్షయ |
| ఊపిరితిత్తులవాపు | ఫారింజైటిస్ |
| టైఫాయిడ్ జ్వరము | మశూచకము |
| కండ్లకలక | కొరుకువ్యాధి. |

## ఈగలులేకుండ చేయుటెట్లు.

ఈగల ఫ్లై పేపరను బంకకాగితములద్వారా చాలా యీగలను నిర్మూలము చేయవచ్చును. ఇవి సహజముగా యెరువు కుప్పలమీదను పశువులకట్టు కొయ్యలవద్దను, కళ్మలమెత్తివేయు రేకు డబ్బాలలోను మొత్తముమీద యెట్టిమురికి స్థలమందైననుండును. మురికిని, కళ్మలమును దూరముగా నెత్తిపారవేయుటయే యొకవిధమగు నుపాయము. నీయింటిని శుభ్రముగానుంచుము. కళ్మలమెత్తివేయు డబ్బానుగాని, యిల్లూడ్చిపోయునేదేని మూతవేసియుంచిన యీగలందుజీవించనేరవు. వంటగదిని శుభ్రముగా నుంచుము. భోజనపదార్థములలో నేదైన మూతలేకుండ యుంచకుము. వీనికితోడు నీయింటి కిటికీలకు తలుపులకు జల్లెడతీగెలువేసి యుంచుట మరీ శ్రేష్ఠము.



G. C. AND CO.,—MADRAS.

## *To the Readers of this Booklet Who Read English, We Recommend the Following Books:*

### The Christian Sabbath:

*Is it Saturday or Sunday?*..............................R. 1-0-0

IN the Christian world there are two Sabbaths. During the past fifty years the question of which is the true Sabbath has been pressing itself with increasing urgency upon the attention of Christian people. This book is written with the hope of solving this perplexing question for the reader. 128 pages; illustrated.

### Epidemics: *How to Meet Them*..............................R. 1-0-0

A MOST timely book. The following chapter titles speak for its value: "Spanish Influenza," "Influenza and Its Treatment," "Common Colds," "Tuberculosis: Its Prevention and Treatment," "The Cancer Peril," "Children's Diseases," "Prevention of Disease," "A Clean Body," "Home Treatments," "In the Sick Room." 128 pages; illustrated.

### Facing the Crisis..............................................R. 1-0-0

THE book with the message for today. People's minds are seriously exercised regarding present-day conditions and their meaning. They are seeking information from any source that promises success. The future looks dark and foreboding; but in this book the search-light of the Scriptures is turned on the present as well as the future, showing clearly what these things mean. 128 pages; profusely illustrated.

### Here and Hereafter:

*Or Man's Nature and Destiny*..............................R. 1-0-0

THE work is a thorough canvass of the great questions of a future existence, and the nature of man in the present life. Every text in the Bible which has any possible bearing upon these points is taken up and carefully explained. 357 pages.

SOUTH INDIA BRANCH

**Seventh-day Adventist Publishing House**

9 Cockburn Road, Bangalore

